# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-11-1980 సంచిక 2

—* ఈ సంచికలో *—



1—12—80 సంచికలో శ్రీశ్రీ మహాప్రస్థానం - ఒక పరిశీలన, రమణీయ కావ్యం మొల్ల రామాయణం, కన్నీరు నిండినమ్మ కథ, గాడీయ వైష్ణవదర్శనం మొదలగునవి ఉంటాయి

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు. 12—00.
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-11-1980 సంచిక 2


## సారంగధరుని కథ — ఒక పరిశీలన


– కే కిశోరుబాబు, ఎం ఏ.

– కే అశోకబాబు, బి ఎస్‌సి. (అగ్రి)


తెనుగునాట పద్యములుగ, ద్విపదలుగ, నాటకములుగ జానపదగేయములుగ రచింపబడి, చివరకు వెండితెరకు కూడాయెక్కి బహుళప్రచార మందినది సారంగధరునికథ కొందరు దీనిని వాస్తవ గాథయని విశ్వసించిరి మరికొందరు ప్రక్షిప్తపురాణ మని కొట్టివేసిరి సత్యాసత్యము లెట్లున్నను ఇది యచ్చమైన తెలుగుకథగా రూపులు దిద్దుకొని సాహిత్యమున మారుతివలె, మార్కండేయునివలె, చిరంజీవిత్వమును సంపాదించుకొన్నది గ్రీకునాటకకర్త 'యూరిపీడస్' రచించిన 'హిప్పోలిటస్' నాటకకథ, రోమను నాటకకర్త 'సెనీకా' రచించిన' హిప్పోలిటస్' లేదా 'ఫేడ్రా' నాటకకథ, మహారాష్ట్ర మందలి 'నవనాథ చరిత్ర', కన్నడమందు గంగాధర కవి రచించిన 'కుమారరామునికథ', కొన్ని బౌద్ధజాతక కథలు, పంజాబు నందలి 'పూరణ్ భగత్' అను పురాతన జానపదగాథ సారంగధరుని కథకు మాతృకలవలె నున్నవని పరిశోధకులు పేర్కొనుచున్నారు

ఈగాథ మన హైందవ దేశమునకు గ్రీకు, రోమన్సు మొదలగు పాశ్చాత్యదేశములనుండి దిగుమతియై యుండవచ్చునని, ఒక యువతి కుమారునికవయగోరుట వంటి ధర్మవిరుద్ధమైన కథలు మనపురాణ వాఙ్మయములందరుదని, తల్లినే పరిణయమాడి సంతానమును బొందిన 'ఒడీపస్' వంటి గాథలు గ్రీకు రోమను సాహిత్యములందనేకము లని, క్రీస్తుశకము రెండవశతాబ్దమునకు మొదటి నుండియు రోము మొదలగు పాశ్చాత్య దేశములతో వర్తకవ్యాపార సంబంధములు కలిగియున్న దక్షిణాపథమునకు ఈగాథ ముడిసరకులతోపాటు కలసి ఒకముడి సరకువలె వచ్చి మెరుగులు దిద్దుకొని సాహిత్యమున స్థానము సంపాదించుకొని యుండవచ్చునని శ్రీ పోణంగి అప్పారావుగారభిప్రాయపడినారు

రోమను నాటకకర్త సెనీకా రచించిన హిప్పోలిటస్ (ఫేడ్రా) నాటకకథ ఈ విధముగానున్నది హిప్పోలిటస్ గ్రీకు దేశపు సార్వభౌముని మొదటి భార్య పుత్రుడు రూపవంతుడు గుణవంతుడు ఆ రాజుగారి రెండవభార్య ఫేడ్రా యతనిని వలచి యతని పొందుకొరకు తపించుచుండెను ఒకనాడు రాజు దేశాంతర మేగుట సంభవించెను హిప్పోలిటస్ అంతఃపురమునకు వెళ్ళగా ఫేడ్రా తనవాంఛ నెరిగించెను అది విని యతడు ఆగ్రహించి కరవాల మెత్తి యామెను వధింపబూనుకొని, తరువాత స్త్రీహత్యా పాప మని, దోషమని, భావించి తనఖడ్గము నచటనే విడిచి వెళ్లిపోయెను మంథరవంటి స్వభావముగల రాణిగారి పరిచారిక యొకతె రాణిగారి తప్పును కప్పిపుచ్చబూనుకొని ఆకత్తిని చేబూని గోరంతలుకొండంతలుగా జేసి రాజకుమారునిపై ఘోరాపరాధమును మోపెను ప్రయాణమునుంచి తిరిగివచ్చిన చక్రవర్తి దాసీ, రాణి, పన్నినకుట్ర సత్యమని సుతుని చంపించెను అతనిమరణానంతరము రాణి ఫేడ్రా యాకైదువును గొనివచ్చి, యతని కళేబరముపై బడి వగపుచెందుచు నా రాజకుమారుడు నిర్దోషి అని ప్రకటించి తత్‌క్షణమే యాయడిదముపైబడి మరణించెను ఈసంఘటనను జూచిన భూపాలుడు గోడుగోడుమనుచు మిత్తినాహ్వానించును ఈకథలో రాజకుమారుడు శుద్ధాంతమునకు వచ్చుటకుంగల కారణ మేదియో సెనీకా వివరించలేదు

ఇక 'యురిపిడస్' నాటకకథలో రాణి రాజకుమారుడు వీరిరువురు నొకచోట కలిసికొన్న సన్నివేశములు కనిపించవు తనను ప్రేమింపుమని రాణి రాయబారమంపించును దానిని రాజకుమా

పడు తిరస్కరించును తనచిరకాల వాంఛితము అవమానముగా పరిణమించగా నామె ప్రాయోపవేశము చేయ బూనుకొనెను కాని దాసితో కలిసి కల్పించి వ్రాసిపెట్టిన యొక లేఖమూలమున రాజకుమారుడు రాణిని బలాత్కరించె నని రాజు తెలుసుకొని యది యథార్థ మని కుమారుని నురుము చేయించెను పిదప నది వితథమని నృపాలుకు పొరపాటుపడెనని విషయమును 'డయానా దేవత' తెలియ జేసెను హిపొల్లిటస్ దుర్మరణమునకు ఫేడ్రా అతనిపై మరులుగొనుటకు వీనస్ దేవత అలుక ప్రధానకారణ మని సెనీకా ఈనాటకమం దొక మార్పును గావించెను

సారంగధరుని వృత్తాంతమును దెలుపు మొట్టమొదటి తెలుగు గ్రంథము గౌరన నవనాథచరిత్ర (15వ శతాబ్దమునకు పూర్వభాగము) ప్రథమ ద్వితీయాశ్వాసములం దీకథ వర్ణింపబడినది సారంగధరుడు 'చౌరంగి' యను పేర సిద్ధుడుగా మారె నని గౌరన పేర్కొనెను ఈకథ నాంధ్రభూమిలో మొక్కగా నంటుగట్టి మొలిపించిన మొదటి కవీశ్వరుడు ద్విపద బాలభాగవతకర్తయగు దోనేరు కోనేరుకవి (క్రీ శ 1547) తరువాత నతని యడుగుజాడలలోనే ఆ మొక్కను మరిన్ని కొమ్మలు రెమ్మలతో నభివృద్ధి గాంచునట్లొనర్చి దానిని పూర్తి తెలుగువారి పెరటిచెట్టుగా మార్చినకవులు అప్పకవి, సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు, బాణాల శంభుదాసుడు, కూచిమంచితిమ్మన మొదలగువారు

గౌరనకృత మగు నవనాథ చరిత్రయందలి సారంగధరుని కథకు తెలుగుదేశమునకును రవంతసంబంధము గోచరింపదు అది మాళవదేశమందలి మాంధాతపురమున జరగినట్లు తెలుపబడినది మాంధాతపురము నేలిన పార్థివుడు రాజరాజనరేంద్రుడు 'పంచదార వెనుదీయగా' తీయగా విజయవిలాసమును రచించిన చేమకూరకవి (1630) కూడా గౌరన కథనే కైకొని సారంగధర కథను పద్యరూపమునం గూర్చెను అతడును రాజరాజనరేంద్రుని మాళవపతి యనియే తెలిపెను ఈకథ రాజమహేంద్రవరపురమున రాజరాజనరేంద్రుని స్వగృహమునే జరిగినట్టులు తెలిపియు దేశముమాత్రము మాళవ మని యసందిగ్ధముగా తెలిపినాడు దీనినిబట్టి సారంగధరుని కథకును, నాంధ్రదేశ మందలి రాజమహేంద్రవరమునకును, దాని భూపతి యగు రాజరాజనరేంద్రునకును ముడిపెట్టుగాథలు చేమకూర కవికిపూర్వమే జనులనోళ్ళలో నలుగుచు వెలుగుచున్నందువలన నాతడు తద్విరుద్ధముగా కథను సృష్టింపజాలక యథార్థమును పూర్తిగా కప్పిపుచ్చలేక ఈవిధముగా వ్రాసియుండవచ్చునని శ్రీ జి నాగయ్యగారు తమ 'ద్విపదవాఙ్మయమునం' దభిప్రాయపడియుండిరి వేంకటకవి తరువాతి కవు లగు కూచిమంచితిమ్మన, బాణాల శంభుదాసుడు 'గౌతమీతీర దేశమున రాజమహేంద్రవరంబను వీడున' నే ఈకథ జరగినట్టులు స్పష్టముగా వివరించియున్నారు

గౌరన చిత్రాంగిని 'నృపభోగభామిని', 'భూకాంతునిభోగసతి' యని రాజరాజనరేంద్రుని భోగస్త్రీగా పేర్కొనినాడు చేమకూర కూడా 'భోగవటీల శిరోజాతిలక' మని 'వారకాంత' యని చిత్రాంగిని రాజరాజనరేంద్రుని కొలువ గానే చెప్పినాడు చిత్రాంగి విషయము వేశ్యాప్రసక్తి పావురములు వ్రాలు సందర్భమునందే గౌరన కావ్యమందు తెలుపబడినది వేంకటకవి మాత్రము రాజరాజునకు చిత్రాంగియను వెల్లాటకత్తె, రత్నాంగి యను కులసతి, యున్నట్లు గ్రంథారంభముననే తెలిపినాడు గౌరన గావించిన చిత్రాంగి పరిచయసన్నివేశము కొంత యుచితముగ నున్నది కాని చేమకూర కల్పించిన ఈమార్పు అంతసంభావ్యముగ గన్పించదు తన తల్లియగు రత్నాంగితో సమవయస్కురాలైన చిత్రాంగి సారంగధరుని ప్రేమించిన దనుట యసమంజసముగా నున్నది బాణాల శంభుదాసుడు చిత్రాంగిని రాకొమారితగాను రాజరాజు రెండవ భార్యగాను పాణిగ్రహణమునకు పూర్వమే సారంగధరునిపై రాగము గొన్నదానినిగాను, చిత్రించి నాడు సారంగధరుని పరిగ్రహ ప్రయత్నమున కన్నియల నన్వేషించుచు రాజరాజు చిత్రాంగి చిత్రమును జూచి యనురక్తి గొని కృపాణమును బంపి ఉద్వాహకార్యముద్వారా చిత్రాంగిని సతిగా నొనర్చికొనె ననియు తాను చిత్రమందు జూచిన జగదేకసుందరుడు, వివాహమాడినవాడు ఒకరు కాకుండుటచేత ననుమానించి చెలికత్తియ పలుకులవలన నిజమెరిగి తాను మోసగింపబడినట్లుగ్రహించి ఇష్టములేని కాపురము చేయుచుండె నని ఈకథయం దలతియలతి మార్పులు గావించినాడు దీనినే కూచిమంచి తిమ్మకవి యనుకరించినాడు వీరు గావించిన మార్పుల మూలమున చిత్రాంగిపాత్ర కున్నతి, రాజరాజుపాత్ర కధోగతి యుత్పన్నమగుచున్నదని, బుద్ధిమంతుడైన సుబుద్ధి చిత్రాంగి యింటికేగుటవలన కీడు గల్గునని సారంగధరునివారించుట యనుచిత ప్రసంగమగునని, యందువలన శంభుదాసుని సవరణ తదనుసారి తిమ్మకవి రచన సరసమైనదికాదని తోచుచున్నదని, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగా రభిప్రాయ పడినారు

గౌరన సారంగధరుని భార్య 'మంగళాంగి' యని వేంకటకవి 'మంజువాణి' యని వేర్వేరు పేర్లను బెట్టి ఒకపాత్రను సృష్టించినారుగాని వారి రచనలం దామెకు ప్రాధాన్యము శూన్యము సారంగధరుని దండన విధింపబడినపు డామె శోకించినట్లు కూడా వారు పేర్కొనలేదు రామాయణము నందలి యూర్మిళవలె భారతము నందలి జరత్కారువువలె కాదంబరియందలి పత్రలేఖవలె ఈమె యొక యుపేక్షిత నాయిక

నాటకములందు శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి విషాదసారంగధర మిగుల ప్రసిద్ధి కెక్కినది. 'పది శోకాంత నాటకములు చేసినంతపని తెలుగువారి కిది యొకటే చేసినదని శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు దీనిని పొగడినారు ఆచార్యులవారు బాణాల శంభుదాసుని కథాంకురమును గొని యందు ఆంగ్లేయ నాటక లక్షణములను నిబిడీకరించి దానిని మనోహరముగా తీర్చిదిద్దినారు మన్మథుని చేతి కీలుబొమ్మగా, మహాకాళిగా చిత్రాంగిని, మొదట కామాతురునిగా, పిదప తన యేకైక సుతునికి శిక్ష విధించు సమయమున పైకి గంభీరుడుగ దోచుచు లోలోన మరిగి నురుంగులుకట్టు సముద్రమువలె విచారవహ్నిచే దహింపబడినవానినిగా రాజరాజును, సర్వసద్గుణపుంజముగా సారంగధరుని చిత్రించి నాటకమును ప్రేక్షకుల యెదలోపలి యెదలను కదలించునట్లుగా నిర్మించినాడు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పంచమ వేద మనదగిన మహాభారతకృతికర్త యగు రాజరాజనరేంద్రుడే చిత్రాంగిని మోహించినవాడని తన రాజరాజునాటకమందు మళ్ళీ ఈ కథను పదహారణాల తెలుగుకథగా సృష్టించినారు వాగనుశాసనుని ధర్మజ్యోతితో ధగధగలాడింపజేస్తూ చిత్రాంగీ సారంగధరుల చరిత్రను క్రొత్తతీరులో మంజులముగా మలచినారు శ్రీ శాస్త్రిగారు

కథలో నూత్నకల్పనలు గావించి మనోజ్ఞముగ సంతరింపబడిన మరొక నాటకము శ్రీ కాళ్ళకూరి నారాయణరావుగారి చిత్రాభ్యుదయము కాళ్ళకూరివారు స్వతంత్రించి నాటకములో పెక్కు పెనుమార్పులు గావించి కథ మూలస్వరూపమునే మార్చివైచినారు చిత్రాంగీ సారంగధరులకు ధైర్యముగా పెండ్లి గావించిన ధీరులు శ్రీ కాళ్ళకూరివారొక్కరే! వారుతప్ప ఆ నాటకమునందరు విషాదాంతముగా కల్పించినవారే!

ప్రధానామాత్యుడగు, గుణదేవునకంటె నరపాలునకు తానెక్కువ ప్రీతిపాత్రుడు గావలయు నని ఉపమంత్రి హరిశర్మ, గుణదేవుడు తీర్థయాత్రలకు వెళ్ళిన సందర్భమున రాజునకు చిత్రాంగిపై మోహము గలుగునట్లుజేసి కుత్సితచర్య సహాయమున చిత్రాంగికి సారంగధరుడే వరుడని చెప్పి, రాజుగారి కాత్మీయకమునకు చిత్రాంగికి కల్యాణ మొనరించెను తరువాత నతని నిక్కృతమును గ్రహించి చిత్రాంగి కన్యాగౌరీ వ్రతమిషతో ప్రభువు కంటబడకుండ తప్పించుకొనుచు నేర్పుతో సారంగధరుని యవరోధమునకు రావించుకొని సత్యమును నివేదించి, తనను స్వీకరించుమని వేడుకొనెను సారంగధరు డందు కంగీకరించనందువలన ఆమె నిరాశతో గోదావరి యందుఁ బడెను చిత్రాంగి యాత్మహత్యకు సారంగధరుని దౌష్ట్యమే హేతువు గావచ్చునని న్యాయాధిపతి యూహించెను. అతని యభిప్రాయముతో నేకీభవించి రేడు సారంగధరునకు శిక్ష విధించెను ఆ సమయమున యాత్రనుండి తిరిగివచ్చుచున్న మంత్రి గుణదేవుడు చిత్రాంగీ సారంగధరుల నిరువురను రక్షించి మౌనినాథాశ్రమమున సురక్షితముగానుంచెను అచట జరగిన యంతర్నాటికా ప్రదర్శమువలన రాజరాజమహీక్షితుడు సర్వము నెరిగి పశ్చాత్తాప్తుడై చివరకు చిత్రాంగీ సారంగధరుల కుపయామ మొనరించెను. ఇదియే చిత్రాభ్యుదయ కథాసారాంశము. ఈవిధముగా 'తనుగావించినసృష్టి తక్కొరులచేత గాదు'' అన్నట్లు కాళ్ళకూరివారు మిగుల స్వాతంత్ర్యమును వహించి యభూతకల్పనలుగా నటువంటి మనోజ్ఞకల్పనలు గావించి, చిత్రాంగి సారంగధరుల పాత్రలకొక విశిష్టతను సమకూర్చినారు. నేరమంతయు ఒక మంత్రిదని మిగిలినవారందరు నిర్దోషులని నిర్మలాంతఃకరణులని కాళ్ళకూరివారు రుచిరముగా చూపించినారు!

ఈరెండునాటకముల తరువాత గుడిపాటి చలంగారి చిత్రాంగినాటక మెన్నదగినది.

చిత్రాంగీ సారంగధరులు తొలుతనే ప్రేయసీప్రియులని రాజరాజధికార గంధమువలన చిత్రాంగిని వివాహమాడెనని నిరూపించి, యట్టి బలవంతపు వివాహములు దేశములందు కొల్లలు కొల్లలుగా జరుగుచున్నవని వీటన్నింటి పర్యవసానము చిత్రాంగీ సారంగధరుల వలెనే విషాదాంత మని చలంగారు సందేశ మందించినారు ఇందు సారంగధరుని కంటె చిత్రాంగిపాత్రను చిత్రించుట యందే చలంగారెక్కువయాసక్తిని ప్రదర్శించినారనవచ్చు

ఈవిధముగా తెలుగులో పెక్కురు కవులు సారంగధర చరిత్రను తమ చిత్తవృత్తికి దోచినరీతిగ మార్చి అది అసలు సిసలైన తెలుగుకథే యని ఋజువుపరచ ప్రయత్నించిగారుగాని, దానివలన విమలాదిత్య తనూజుడు, విమలవిచారుడు సుమారవిద్యాధరుడు నుత్తమచాళుక్యుడు వివిధాగమ విహితశ్రముడునగు రాజరాజు శీలమున కొకమాయని కళంక మంటినదని యెవ్వరును నిశితదృష్టితో పరిశీలించలేదు.

ఈవ్యాసమున కుపకరించిన గ్రంథములు

తెలుగునాటకవికాసము-
శ్రీ పోణంగి అప్పారావు
ద్విపద వాఙ్మయము-శ్రీ జి నాగయ్య
ఆంధ్రనాటక పితామహుడు-
శ్రీ దివాకర్ల వేంకటావధాని
నాటకోపన్యాసములు-
శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ
రాజరాజు (నాటకము)-
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
చిత్రాభ్యుదయము-
శ్రీ కాళ్ళకూరి నారాయణరావు
చిత్రాంగి- శ్రీ గుడిపాటి చలం

# వాస్తవకథనములో అవాస్తవములు

- శ్రీ మధుర కృష్ణమూర్తిశాస్త్రి

శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి, సుబ్రహ్మణ్యశాస్త్రిగారలు 16-8-1980 తేదీ 'సమాలోచన' పక్ష పత్రికలో 'వాస్తవకథనము'అను వ్యాసమున 7 వ పేజీ 2 వ కాలములో నీ క్రింద రీతిని వ్రాసియున్నారు

10) లో, ఉపపత్తిందు శేఖరమున దుర్గాప్రసాదద్వివేది మహాశయులు అయనాంశ నిర్ణయసందర్భమున ఇట్లు పేర్కొని యున్నారు

"ఇత్థం చ పూర్వదర్శితేనైవ పథా అయనాంశ జ్ఞానం సుశకం అమునేవ పంథానం సిద్ధాంతదర్పణకర్తా చంద్రశేఖర సామంతః సిద్ధాంతశిరోమణి పరిష్కారావిష్కారకో బాపూదేవశాస్త్రీ । గణిత గోలపారదృశ్వా సుధాకరద్వివేదీ చ ఆశ్రయంతే॥ అతఏవ యూరోపియన గణితసామ్రాజ్య ధురంధరః కేతకీకర్తాపి దత్తాహస్తావలంబ ఇతి ప్రాచామర్వాచాం చ ద్వావింశత్యంశాసన్నే౽యనాంశే సహానుభూతి రస్త్యేవ 'అస్మిన్విషయే 1798 శకే కాశ్యాం భట్టసఖా రామబాపూదేవ శాస్త్రి రానడోపాఖ్య బాలశాస్త్రి సుధాకర ప్రభృతీనాం చ సంమతయోపి పంచాంగోప పాదన పుస్తకే ముద్రితా ఇత్యలం॥ అని వ్రాసిరి

ఈపైని వ్రాసిన దానిలో "ఇత్థం చ పూర్వ దర్శితేనైవ పథా అయనాంశ జ్ఞానం సుశకం" అన్న వాక్యమునకు పూర్వములో గల అయనాంశ జ్ఞానోపాయమార్గ మేమి గలదో అది చెప్పియుండలేదు ఆ మార్గము వీరు చెప్పుచున్న చైత్రపక్షము గాదు

శ్రీ చంద్రశేఖర సామంతులు, బాపూదేవశాస్త్రిగారు, సుధాకరద్వివేదిగారు చైత్రపక్షమును ఆశ్రయించలేదు. చైత్ర పక్షాయనాంశలను వారు చెప్పియుండలేదు కేతకీగ్రంథకర్తృజగత్తును గొప్పగ మోసగించిన మహానుభావుడు అనుట కెట్టి సందేహము లేదు

శ్రీ వేంకటేశకేత్కారుగారు తాము దృక్సిద్ధవాదులయ్యు తాము ప్రప్రథమముగ రైవతపక్షము నాశ్రయించి ఇదియే సరియైన దని సంపూర్ణముగ విశ్వసించి, ప్రథమపర్యాయము జ్యోతిర్గణితమును ముద్రించిరి ఆగ్రంథ మందు రైవతపక్షమే గ్రహించబడినది అప్పటి సనాతనభాందవ సిద్ధాంతులు వీరి గ్రంథమును గౌరవించక,వీరు చెప్పిన విషయమును పట్టించుకొనుండ వదలి వేయుటయేకాక అప్పటికి సూర్యసిద్ధాంత, గ్రహలాఘవాది గ్రంథములవల్ల గుణించబడిన అవాస్తవమునైన 22 అయనాంశములకు సరిపడునట్లుగ గ్రంథమును చేస్తే మీపుస్తకమును గ్రహించగలమని, లేకపోతే మీ పుస్తకాన్ని, వాదాన్ని కూడ గ్రహించేది లేదని నిండుసభలో చెప్పుటచేతనే (యీ విషయమును ద్వితీయముద్రిత జ్యోతిర్గణితములో కేత్కారుగారే వ్రాసుకొన్నారు) తాము ద్వితీయ ముద్రితజ్యోతిర్గణితమందు చైత్రపక్షమును గ్రహించినారు ఈ చైత్రపక్షము దృక్సిద్ధము కాదు. పరంపరగ వచ్చుచున్న అవాస్తవమైన మార్గమునకు సంబంధించినది 'ఎవరైతే దృక్సిద్ధమును గ్రహించక, పూర్వపద్ధతినే అనుసరించి వ్యవహరించెదరో వారికొరకే చైత్రపక్షము చెప్పబడినది' అని స్వయముగ స్పష్టముగ చెప్పినారు. ఈ క్రింది శ్లోకములను చూస్తే పాఠకుల కిందులో గల వాస్తవము తెలియగలదు

'శాకే షడ్గోభిక్షుల్యాం
శరది సమభవ త్వేరవర్ష ప్రవృత్తీ
రేవత్యాం సౌరపక్షే
సదలవనువివా ద్వ్యస్మితాధిక్యభావాత్
మందంమందం పుర స్సా
ప్రచలతి సతతం రేవతీత శ్చతుర్భి
ర్భాగై ర్గతేఽధునా సా
భవతిపునరితో ప్యగ్రత స్సంభవేచ్చ॥
తస్మా ద్వర్ష ప్రవృత్తిః
పునరపి చ యథా రేవతీ తారకాయాం।
స్యా త్తాదృక్సవ్యవస్థా
కరణ ఇహ మయా రైవతఃపక్షఉక్తః
ఇచ్ఛేయు ర్యే న హాతుం
సువృథఒరిచయా ద్వర్తమానాం
ప్రవృత్తిం ।
తేభ్య శ్చైత్రాఖ్య పక్షః
ప్రచలనరహితః సంగృహీతః కిలాత్ర॥
నావశ్యా కోప్య కానాం
పున రిహ రచనా నోత థాజ్ఞాపకోన్యో
వ్యత్యాసో నైవ రీతా
ధ్రువపరిమితా మేవ కాచిద్భిదా స్యాత్
ఇష్టంచేత్ చైత్రపక్ష
ధ్రువక పరిమితీ ర్న్యూనశీర్షే లిఖిత్వా।
శేషంపూర్వో క్తరీత్యా
తిథిపటగణితం ఖేటచారం విదధ్యాత్.

ఈ పై శ్లోకములందు శ్రీకేత్కారుగారు తాను దృక్సిద్ధగణితమునే చేయదలచినవాడై రైవతపక్షమును చెప్పినట్లు 'రైవతః పక్ష ఉక్తః' అని తెలిపియుండెను ఎవరు ఈ గణితమును (దృక్సిద్ధగణితమును) చేయుటకు ఇష్టపడరో పూర్వపద్ధతినే అనుసరించెదరో వారి నిమిత్తము చైత్రపక్షమును సంగ్రహించితిని అని'సంగృహీతఃకిలాత్ర'అనువాక్యములో చెప్పియుండెను అప్పటికి (తాను గ్రంథము రచించే సమయమునకు) 22 అయనాంశములు పూర్వపద్ధతిరీత్యా వచ్చియుండుటచేత, దీనిని పట్టుకొని పూర్వపద్ధతి పంచాంగ కర్తలను తృప్తిపరచుటకు తన గ్రంథము ప్రచారముగుటకొరకు మాత్రమే చైత్రపక్షమును తన గ్రంథ

ములో ప్రవేశపెట్టి యుండినట్లు శ్రీ కేత్కారుగారే చెప్పుకొని యుండిరి దీని భావమేమనగా 'ఎవరైతే పూర్వ పద్ధతిని వదలిపెట్టుటకు ఇష్టంలేనివారో, దృగ్గణితమును చేయుటకు ఇష్టపడరో వారు చైత్రపక్షరీత్యా చేసుకోవచ్చును' అని భావము ప్రకృతము మన వారు దృగ్గణితమును చేయవలయు నని వాదిస్తూ గ్రంథకర్త చెప్పినమార్గమును వదలిపెట్టి చైత్రపక్షము ననుసరించి వ్యవహరిస్తూ ఇదియే దృగ్గణితపద్ధతి యనుట హాస్యాస్పదము

మరియు ఉపపత్తిందు శేఖరమందు వ్రాసినమార్గమే సరియైన దవి, చంద్రశేఖరసామంత, బాపుదేవశాస్త్రి, సుధాకరద్వివేదిగారలు ఆ మార్గమునే ఆశ్రయించి యుంటే ఆమార్గమునే యనుసరించవలయును గాని చైత్రపక్షము నేల ఆశ్రయించవలసివచ్చును ?

మరియు 7 పేజీ 3వ కాలములో 'నూరు సం॥ల క్రితమే కాశీలో జరిగిన సమ్మేళనములో సభా రామపండితుడు, బాపూదేవ శాస్త్రి, బాలశాస్త్రి, సుధాకర ద్వివేది పండితులు 22 అంశాసన్నముగ అయనాంశలు అంగీకరించినట్లు కేతకరు అయనాంశలతో సరిపోవుచున్నట్లు దుర్గాప్రసాద ద్వివేదిగారు ఉపపత్తిందు శేఖరమున చెప్పినారు' అని వ్రాసినారు

రమారమి నూరుసంవత్సరముల క్రితము సూర్యసిద్ధాంతమందు చెప్పిన ఛాయార్కకరణార్క పద్ధతి ననుసరించి 22 అయనాంశలు వచ్చుచున్నవి. గ్రహలాఘవరీత్యా గూడ 22 అయనాంశములపైని వచ్చుచున్నవి ఆప్రకారంచూస్తే సూర్యసిద్ధాంత మధ్యమసూర్యుడు దృక్సిద్ధుడు కాడు కనుక ఆ గ్రంథాన్నిబట్టి సాధించిన 22 అయనాంశములు తప్పు అని చెప్పక తప్పదు గ్రహలాఘవములో అయనగతి 60 వికలలు చెప్పియుండుట చేత ఆప్రకారం సాధించగవచ్చిన 22 చిల్లర అయనాంశములు గూడ తప్పైనవే అగును అయనగతి వేధసిద్ధగతి 50 27 కాగా గ్రహలాఘవోక్తగతి 60 వికలలు వుండెను అందువలన 22 అయనాంశలనుట అశాస్త్రీయము అవాస్తవము అని గ్రహించవలయును ఇట్టి వాస్తవములు గాని అయనాంశములను సమర్థించబూనిన చైత్రపక్షాయనాంశలుగూడ అవాస్తవము లనుట నిర్వివాదము అందుచేతనే కేత్కరుగారు చైత్రపక్షమును ప్రాచీన పద్ధతి ననుసరించువారికొరకు సంగ్రహించితి నని స్పష్టముగ తన అభిప్రాయమును తెలిపియుండిరి

పంచాంగకర్తలు శాస్త్రవివేచన చేయుశక్తిలేనివారై తప్పుదారిలో పడి తమ ననుసరించుచున్న మార్గమును సమర్థించుకొనుటకు అనేక అసత్యములను ప్రచారము చేయుచు కాలమును గడపుచున్నారు చైత్రపక్షము దృక్సిద్ధము కాదని కేత్కారే సెలవిచ్చియుండెను. అయినను లోకములో పంచాంగకర్తలు తాను చెప్పిన దృగ్గణితపద్ధతి నవలంబించుటలేదని యీ మార్గమును సృష్టించి లోకమును గొప్ప మోసములో పడవేసెను దీనికి తార్కాణములు ఆగ్రంథములందు వ్రాయబడియేయున్నవి గ్రంథములోగల అనేక దోషములను వ్రాయుట సాధ్యపడని కారణంచేత ముఖ్య విషయమును వ్రాయుచుంటిని.

'కేతకీ గ్రహగణితం 8 వ శ్లోకం ॥
సౌరోర్క గ్రహలాఘవీయ శశిభా
మాన్యర్కజా మధ్యమాః ॥'

అను శ్లోక వివరణములో 'సూర్యసిద్ధాంతాగతః సూర్యః దృక్సమః' అని వ్రాయబడెను ఈమాటయే సరియైనచో తాను చైత్రపక్షమును సృష్టించవలసిన యవసరమే లేదు

సూర్యసిద్ధాంతోక్త ఛాయార్క కరణార్కాంతర రూపాయనాంశలే దృక్సమములు అగుచున్నవి వానివలననే సమస్తము వాస్తవము లగును ఆపద్ధతి ననుసరించినచో సరిపోవును. అటుకాక చైత్రపక్షసృష్టి ఎందుకు చేయవలసి వచ్చినది ? రైవతపక్షము నెందుకు చెప్పవలసి వచ్చినది? దీని కెవరును సమాధానమును చెప్పుటకు సాహసింపరు

శ్రీ కేత్కారు గొప్ప విద్వాంసుడై యుండికూడ నిజముమీద నిలబడుటకు శక్తి లేనివాడై అవాస్తవము లైన వానిని పంచాంగకర్తల సంతోషమునకు ప్రవేశపెట్టెను కనుక చైత్రపక్షము సరియైన దనుటకు ఏవిధమైన శాస్త్రప్రమాణము లేదు ఓటింగుపద్ధతిలో చైత్రపక్షము సరియైనదని చేతులెత్తేవారేకాని నిలబెట్టి అడిగితే ఏమియు చెప్పలేరు కనుక చైత్రపక్షం మాత్రం శాస్త్రీయం కాదు ఆప్రకారంగా సాధించబడుచున్న అయనాంశములు ఇప్పటికి 23 చిల్లర గూడ సరియైనవి కావు ఆపద్ధతి పంచాంగములుకూడ ఆచరణయోగ్యములు కావు, అని పాఠకులు గ్రహించగలరు లోకమునకు నిజము చెప్పాలి శాస్త్రముయొక్క యథార్థతను తెలియచేయాలి. తప్పును వదలిపెట్టాలి అనే భావాలుగల విద్వాంసుడు ప్రతివాడు చైత్రపక్షము సరియైనది కాదని తీసిపారవేసినవాడే కాని అంగీకరించినవారెవ్వరున్ను లేరు అనేకులు విమర్శకులు వ్రాసిన విషయము లున్నవి. వాని నన్నింటిని ఉదహరించుట విస్తరము కాగలదు అని వ్రాయలేదు

భారతప్రభుత్వ పంచాంగ సంస్కరణ సంఘమువారు వారి రిపోర్టులో వ్రాసిన అవకతవకలు అనేకము లున్నవి. ఈ క్రింది 2, 3 వాక్యములు ఉదాహరణకు చూపబడుచున్నవి

Dr Gorakh Prasad thereafter submitted a note containing his definite Propasals in this respect, which was also circulated amongst the members He proposed that "23 - 15" be taken as the 'Ayanamsa' on the Vernal equinox day (21 st March of 1956, because this will reconcile most of the Panchan

gas in India based on modern constants

అనగా ప్రకృతము ప్రచారములో నున్న పంచాంగములను సమాధానపరచుటకు మాత్రమే 23 - 15 అయనాంశములను స్వీకరించడమైనది అని భావము. ఈ పేజీ 1 వ కాలములో,

Sri Labari and Prof Vaidya pointed out that if any change is introduced in the 'Ayanamsa' at this stage, the calendar for four years so far calculated will require a thorough revision involving a great amount of labour and time' అని వ్రాయబడెను

అనగా శాస్త్రపరిశోధనద్వారా అయనాంశలలో ఏదైన పెద్దమార్పు చేయదలచినచో, ఇప్పటికి పూర్తిగ గుణించబడిన 4 సం॥ముల పంచాంగమునంతను మార్చవలసి యుండును. దానివలన ఎక్కువ శ్రమ, ఎక్కువ కాలము పట్టును, అని భావము

ఏదైన నొక శాస్త్రవిషయము నిదమిత్థమని తేల్చదలచినప్పుడు సత్యాన్వేషణ బుద్ధితో నుండవలెను సత్యమును తేల్చి చెప్పవలెనుగాని చేసినపని వృథా యగునని కాని, ఎక్కువకాలము పట్టునని కాని శ్రమయని కాని తలంచరాదు వీరట్టి సత్యాన్వేషణముతో కృషి చేయలేదనుట స్పష్టము కనుక ఎవరెవరు ఏమి వ్రాసినను, ఎంత కోలాహలము చేసినను చైత్రపక్షము ప్రకారము సాధించబడిన అయనాంశములు దృక్సిద్ధములు కావు అవాస్తవములే యగును అలవాటుగ చేయుచున్న పంచాంగ కర్తలు తమ మార్గమే సరియైనదని చెప్పుకోవడము మాత్రమే కాని దాని యథార్థతను బుజువుపరచుకోవడము మాత్రము వారికి సాధ్యము కాకున్న దని మనవిచేయుచుంటిని.

— —

# శ్రీ లక్ష్మీనృసింహాష్టకం

— శ్రీ గుడి నారాయణబాబు, ఎం.

* శ్రీలనీయర సురవరార్చిత సిరిమగండా భూమిపై
ఏల రారా విమలచరితా ఎల్లవేళల స్వామివై
ఏల నామొర వినగరావుర ఏమి చేసెనొ కామివై
మాలెకొండ నృసింహ నిర్మల మధురమూర్తీ శ్రీధరా !

* మేలుతో నిను వేడువారల మెచ్చవేరా నిచ్చలున్
పాలతో నిదె బాసజేసెద బాళితోడుత రచ్చలన్
పూలతో నిను బూజజేసెద పుణ్యపురుషా పచ్చలన్
మాలెకొండ నృసింహ నిర్మల మధురమూర్తీ శ్రీధరా !

* తాళిగట్టిన ధర్మపత్నిరొ తరలిపోయిన దేలకో
మూలకేగిన ముద్దుగుమ్మను మోద మొప్పగ నేలకో
తూలిపోవును సంకటమ్ములు తూర్ణమాగతి మేలుకో
మాలెకొండ నృసింహ నిర్మల మధురమూర్తీ శ్రీధరా !

* లోల పీతాంబర విలోలా లోకనాయక కావరా !
జాల మేల విశాలలోచన జగతి మమ్ముల బ్రోవరా !
కాలిపోవును నిను దలంచిన కలుషపటలము ధీవరా !
మాలెకొండ నృసింహ నిర్మల కమధురమూర్తీ శ్రీధరా !

* ఆలగాచిన చారుమూర్తీ అంబరీషుని గంటివే
పాల వ్యాస పరాశరాఖ్యుల ఏలగను చేకొంటివే
వేల నారద శౌనకాదుల వేడుకను గనుగొంటివే
మాలెకొండ నృసింహ నిర్మల మధురమూర్తీ శ్రీధరా !

* బాలప్రహ్లాదుండు పిలువగ బయలు వెడలినవాడవే
కాలిపోయెడి శంకరార్యుని కాయమును గాపాడవే
జాలిగా గజరాజు పిలువగ జలచరముఁ జెండాడవే
మాలెకొండ నృసింహ నిర్మల మధురమూర్తీ శ్రీధరా !

* పాలసంద్రమునందు వెలసిన పరమపురుషా దరహరీ !
పాలసుండని మది దలంపకు పతితపావన మురహరీ !
కాలపాశ విముక్తి జేయర కమలలోచన నరహరీ !
మాలెకొండ నృసింహ నిర్మల మధురమూర్తీ శ్రీధరా !

* కాల మంతయు నొక్కరీతిగ గడువబోదుర మాధవా
ఆలసింపకు నీదు సత్కృప కర్వమాదు రమాధవా
కాలహరణము జేయబోకుము కరుణజూడర భూధవా
మాలెకొండ నృసింహ నిర్మల మధురమూర్తీ శ్రీధరా !

# అద్దేపల్లివారి కవితాహాసము - ఋతువిలాసము

- శ్రీ జి. బి. ఎస్. ఆచార్య, ఎం.ఏ., పి. హెచ్ డి

( గతసంచిక తరువాయి )

ఈ కావ్యంలో 'శరదృతువు' ఒక వినూత్నమైన శోభను సంతరించుకున్నది శరత్తును కవిగారు 'శారద'గా సంభావించి, వర్ణించిన తీరు మహోన్నతంగా వుంది.

'శ్రీశారదయె తన చెలువంబుఁగనఁగఁ జే
పట్టిన స్వచ్ఛదర్పణము సరసి
శ్రీశారదయె తనచెలువంబు వెలయింపఁ
బూసిన మంచిమైపూఁత జ్యోత్స్న
శ్రీశారదయె తన చెలువునితో నెక్క
మానసౌకము తెల్లమబ్బు తునుక
శ్రీశారదయె తనచెలువంబు మెఱయఁ గై
సేసిన సిగబంతి జింకతాల్పు
కలువ లీనెడు చక్కని కలువ నింగి
భద్రపీఠంబు నవకలాపంబు డంబు
శ్రీశరత్కాల శోభ వర్ణింపఁ దరమె
ప్రకృతియే శారదగఁదోచెభావమందు'[1]

శరత్కాలమందు, ప్రకృతి సమస్తం 'శారద' గా తోచిన దనటం కవిగారి భావనాబలంలోని వైశిష్ట్యాన్ని తెలియ జేస్తున్నది పూర్వకవులు కూడా ప్రకృతిలో దేవతామూర్తులను దర్శించి, తన్మయత్వంతో తమ కావ్యాల్లో వర్ణించారు శరత్తును 'శారద'గా సంభావించటం కవిగారి అనన్యసామాన్యమైన ప్రతిభకు తార్కాణం 'శరత్తు' యొక్క రూపాంతరమే 'శారద'అని శబ్దరత్నాకరం చెప్పటమేగాక, శరచ్ఛబ్దం ఋతుపర్యాయమందు స్త్రీలింగ మని అమరకోశం చెపుతున్నది కాబట్టి 'శారద' అనేది 'శరత్తు' సంబంధమని నిర్ణయించవచ్చు అందుచేతనే కవిగారు శరత్కాల ప్రకృతిని 'శారద'గా సంభావించి తమ ప్రతిభా వైభవాన్ని, బుద్ధివైశారద్యాన్ని, పాండితీగరిమను ప్రస్ఫుటంగా భాసింపజేసారు. ప్రకృతిని మానవీకరించటం-అందులోను ఔచిత్య మెరిగి ఒక దేవతామూర్తిగా సాక్షాత్కరింపచేయటంచేత 'శరత్కాల వర్ణనము' ఈకావ్య యోషకు మణిభూష యని అభివర్ణించవచ్చు

ఇంకా శారదరాత్రిని వాగ్దేవి భవ్య రూపంగాను, అంబరాంబరుని దేహంగాను, పాఁపతేని మనోజ్ఞరూపంగాను, ఐరావతంగాను, ఆకాశగంగగాను, కామధేనువుగాను, నందీశ్వరునిగాను సంభావించి, చిత్రవిచిత్రమైన కల్పనా సామర్థ్యాన్ని వెల్లడించారు [2] ఇంకా శరన్నవ శుభ్రకాముడిని దిక్కులు గెల్చినట్టి రణధీరుల స్వచ్ఛయశోవికాసంగాను,[3] చక్కెర వింటిజోదు సుమచాపవిలాసంగాను, చక్కదనాల కుప్పయైన శారద మోమున నొప్పు హాసంగాను మనోహరంగా వుత్ప్రేక్షించారు.

'పదివేసములసామి పన్నుండగా నెంచి
పాఁప పాన్పును దీర్చు పాలకడలి
వెండికొండదునీఁడు వెలఁది
మిన్నను గూడి
లీలనెక్కెడు తెల్లయాలపోతు
కలుములతల్లి కోడలు పల్కు జవరాలు
మించు వేడుక నెక్కునంచ తేజి
చక్కనివాఁడంచు జుక్కలతేనికి
నింబుగా దిక్కుల కెక్కుడంబు
అమితముగఁ బండు నాచకోరముల పంట
శ్రమముఁ బోఁగొట్టి కాంతిసౌఖ్యములఁ
గూర్చు
భవ్యసౌధమ్ము, సర్వసంపత్కరమ్ము,
ధాత్రి శుభదాత్రి యీశరద్రాత్రి జైత్రి!'

శరత్సమాగమవేళా సౌభాగ్యమహిమతో కాల మేవిధంగా శోభించిందో పై పద్యమందు వర్ణించబడింది. ఇందలి హరిహరుల స్ఫురణ ప్రశంసనీయమైనది. శారదరాత్రిని 'చకోరముల పంట' అని సంభావించటంలో రమణీయార్థ ప్రతిపాదన మున్నది

'ధాత్రి శుభదాత్రి యీ శరద్రాత్రి జైత్రి' అనే చివరి పాదంలోని శబ్దాలంకార సౌందర్య మనిర్వాచ్యము 'సౌందర్య మలంకారః' అని 'వామనుడు', 'కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే' అని 'దండి' అలంకారాలను నిర్వచించారు అలంకారాలు సౌందర్యవంతాలై కావ్యశోభను ఇనుమడించేవి కాబట్టే కవిగారు ఈ కావ్యమందు శబ్దార్థాలంకారాలను సమృద్ధిగా ప్రయోగించారు

'వినుమేఘ, విధుడను గృహమేధి, రేవెలది' మొదలైన రూపకాలు మిక్కిలి రమ్యంగా వున్నాయి వర్షానీరమును, శుభ్రహేమంత క్షీరమును వింగడించి చూపెడు శరచ్చంద్రాంగము, గుణదోషముల వేర్పాటు విషయమునందు మానవులకు మార్గదర్శకమైన దని కవిగారు మెచ్చుకున్నారు మానవులకు 'ప్రకృతి' నేర్పే పాఠం విశిష్టమైనదిగదా! అందుకే మనం ప్రకృతిని ఆదర్శవంతుడైన వుపాధ్యాయునిగా సంభావించి, సగౌరవంగా ఆరాధిస్తున్నాము

శారద రాత్రియందు ప్రత్యక్షమయే పరమ రమణీయ ప్రకృతివిలాస మనుభవైక వేద్యము కవిగారు తమ ప్రతిభావ్యుత్పత్తులచేత, వర్ణనాకౌశలముచేత శరత్కాల శోభను దృశ్య సాక్షాత్కారమొనరించి, సాహితీప్రియాళువులను రసానంద తరంగాల నోలలాడించారు 'వర్ణనానిపుణః కవిః' అనే ఆలంకారికోక్తి ననుసరించి, కవిగారు తమకావ్యంలో వర్ణనల కత్యంత ప్రాధాన్య మిచ్చినారు అందు

శరత్కాల వర్ణనము గణనీయమైనది. ఈ వర్ణనలో కవిగారి హృదయ లాలిత్యము, మృదుసంస్కారము 'చంద్ర చంద్రికా న్యాయము' న ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి

హేమంతము, శిశిరము ప్రత్యేకంగా దేనికది వర్ణించబడ్డప్పటికీ, శిశిరఋతు ధర్మాలు ఎక్కువగా హేమంతఋతువర్ణనంలోనే కలిపి వర్ణించబడ్డాయి ఈ రెండు ఋతువుల ధర్మాలు ఇంచుమించు ఒకే విధంగా వుటాయి కాబట్టే కవిగారీవిధంగా ఋతువులను కలిపి వర్ణించి వుంటారు

'మంచు మేలిముసుంగు క్రొమ్మించుతోడఁ
గలికి గుమ్మడిపూవు మొగమ్ముతోడ
శ్లాఘ్య హిమబిందు ముక్తాస్రజమ్ముతోడఁ
జెంతఁ జెలువొందు బంతి చేమంతితోడ
గొబ్బి చెలికత్తెతో నాడుకొనుచు వచ్చి
సంతసముఁ గొల్పు సతము హేమంత
లక్ష్మి!'

అని రమ్యంగా వర్ణించి, హేమంతాన్ని 'లక్ష్మి' గా సంభావించారు. హేమంతఋతువులో మంచు ఎక్కువగా వుండి వస్తుదర్శనానికి అవరోధం కలుగుతుంది కళ్లుండికూడా చూడలేకపోవటం 'కాలమాంత్రికుని కనికట్టు మహిమ' అని కవిగారు చమత్కరించారు ఈ ఋతువులోని 'చలి' బాధకు తట్టుకోలేక, చల్ల పోసికొనక పాడిముద్దలే తినటం, పాదాలు కడుగుకొనక వలకేలు తడిసేసి తుడుచుకొని సాపడటం, కత్తిబాధకు భయపడి క్షురకర్మను మానుకొనటం మొదలైన మానవస్వభావాలను వివరించారు ఇంకా -

'ఎంతకును దెల్లవారదిదేమి యనుచు
రాగపరవశుఁడౌను వియోగి యొకఁడు'

అని చమత్కరించి, హేమంతే దిన లఘుతా' అనే హేమంత లక్షణాన్ని ధ్వనింపచేసారు

'పేరినయట్టి కొబ్బెరనూనెఁ గొనివచ్చి
ఘృతమని వడ్డించు నతివ యొకతె
చలికి గడ్డడలాడు స్వకళత్రమును గాంచి
తేన్నఁ జూచియ యంచుఁ దలఁచు
నొకఁడు'

ఇత్యాది పాదాల్లో చమత్కారంతో కూడిన 'భ్రాంతి' నేర్పుగా కూర్చబడింది. ఇంకా 'చలి'ని 'రక్కసు' నితో పోల్చి, అది చేసే భయంకర దుశ్చేష్టలను, వానికి భయపడి మానవులు చేసే ప్రతిక్రియలను వర్ణించారు

'బడిగంట వినియు వెంబడిని లేవవుగాని
గుడిగంట యది వినంబడక లేదు
స్వామికిఁ బ్రార్థనాంజలి ఘటింపవుగాని
అంజలిం చెదవు దధ్యన్నమునకు
భక్తి దేవునకు ధూపంబు వేయవుగాని
వేఁడి పొంగలి పొగ విరియనూఁదు,
దెన్నఁడు వెన్నుని సన్నుతింపవుగాని
కోరి ప్రసాదంబుఁ గొసరితిందు
వెట్లు మాటితి విటు భక్తఁ డెప్పుడైతి
వీ ధనుర్మాస మహిమంబు నెన్నఁదరమె!
పేదయంతయు- దా నావు పేడ యవును
ఆలు సైతము గంగెద్దులవును జూడు!'4

అని చమత్కారంగా ధనుర్మాస మహిమను, నేటి సమాజ స్థితిగతులను వర్ణించారు

(సశేషం)

---

1 వర్షాకాల ప్రకృతియందు నీలమేఘములో పోతన - నీలమేఘశ్యాముని, రాయలవారు - వామనమూర్తిని, రామభద్రకవి-త్రిమూర్తులను దర్శించినట్లుగానే ఈ కవిగారు శరత్కాలప్రకృతిలో శారదా స్వరూపాన్ని దర్శించారు

2. 'గంగాప్రవాహంబుగాబోలు నవని వశి
ష్ఠాదు లనుష్ఠాన మాచరింప
నమృతంబు వెల్లువ యని నిలింపాదులు
మునుకొని దోసిళ్ళముంచి క్రోల
దుగ్ధాంబు నిధియని తోయజాక్షుఁడు శేష
పర్యంక మిడుకొని పవ్వళింపఁ
బరమేశు విశ్వరూపంబని బ్రహ్మాదు
లమర దండప్రణామములు సేయఁ
దలఁప భూనభోంతరముల కొలఁది దెలివి
బెరసి యెన్మిదిదిక్కుల బారలి పారలి
దట్టముగ నంతకంతకుఁ దనరి తనరి
యిట్టలంబుగ వెన్నెల నిట్టవొడిచె'

- విక్రమార్క చరిత్రము,
ఆశ్వా 6, పద్య 69.

3 వీరరస ప్రధానాలైన నాటకాలందు, కావ్యాలందు శరదృతువును గానం చేసే సంప్రదాయాన్ని ధ్వనింప చేసారు.

4 ఈపద్యం 'తెనాలి రామకృష్ణు' ని

'ఉష్ణాని హోమాగ్నియూఁద నొల్లఁడు
గాని విరహజ్వరార్తితో వెచ్చనూర్చు
సంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింపఁడు
గాని యొరఁగు నీర్ష్యాకషాయితలకర్థి
నాగమవాదంబులొఁ గాదనఁడు గాని
విటవాదములం దీర్చు వేగిలేచి
కంబుభృత్పాదోదకంబు గ్రోలడుగాని
యావతాధరశీధువాని చొక్కఁ
బుణ్యచిహ్నంబు లపఘనంబున ఘటింప
సిగ్గుపడుఁగాని కరనఖశిఖర అసిత
జాతనూత్న క్షతాంకముల్ సమ్మతించు
నారజము మీరి యాదుర్విహార హారి'

- పాం. మా త్ర ఆ పద్య 12

అనే పద్యాన్ని స్మరింపజేస్తున్నది ఇది కవిగారి 'అభినవ రామకృష్ణ' బిరుదాన్ని అన్వర్థం చేస్తున్నది.

# మనుచరిత్ర - ఒక పరిశీలనము

- శ్రీ సి.హెచ్. శ్రీరామశర్మ, ఎం.ఏ

స్వారోచిషమనుసంభవ మనే కవికృత నామాంతరము కలిగిన మనుచరిత్రలో ప్రాత క్రొత్త వ్యాఖ్యానములలో భేదములు, కొన్నిచోట్ల శాస్త్ర వైరుధ్యాభాసములు గోచరించుచున్నవి ఆ విషయములను మరొక సారి పరిశీలించడమే ప్రస్తుత విషయము

ప్రవరుని పరిచయం గావిస్తూ, కవితాపితామహులు 'ఆపురిఁ బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి' అని అతని సౌందర్యాన్ని చెప్పి, తనివితీరక చివరకు 'అశేష్య తనూవిలాసుఁడై' అని చెప్పేరు. అంతేకాక ధనైక కాముకులకు జారకాంతలకు గూడ ఆకాంక్ష్యమై యున్నది అన్నారు. అంతటి సౌందర్యమును మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి అనే పదంతో పరిచయం చేయించాడు కవి. అంబురుహ గర్భకులాభరణ మయిన భూసుర ప్రవరుని పరిచయంతో మొదటి విశేషణము 'మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి' అని చెప్పడం దేశాటనము, తీర్థసందర్శనము, యాజనాదికము చేయవలసిన వానిని 'ఆపురి బాయకయుండు' ననుట, ఇవి అనుచితము లనిపించక తప్పదు అంటారు కొంతమంది. కాని సర్వైశ్వర్య సంపన్నుడై యుండుట, ఆ పురి బాయకుండుటకు హేతువు మాతాపితృసేవనమునకు అంతరాయము కలుగకుండుటకూడ హేతువే తీర్థయాత్రాది సముపార్జనము కంటె అధికమైన ధర్మం ఇదే గనుక మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి కనుకనే వరూధిని హృదయమునకు ఆరాధ్యుడై ఆ అచ్చర మానసవీథిలో ప్రతిష్ఠితుఁడైనాడు చెప్పవచ్చినగాథ శృంగార ప్రధానము శృంగారమున సౌందర్యమే అతిముఖ్యం జరిగేకథ శృంగార విషయకము అని ఈ విశేషణంద్వారా తెలుపుతున్నాడు మహాకవి.

ఇంక సమాసానికి అర్థం చెప్పే వ్యాఖ్యాతలు మకరాంకునివలె, శశాంకునివలె మనోహరమైన ఆకారము గలవాడని అర్థం వ్రాశారు భిన్న స్థలములలో వ్రాసిన వాక్యాలు ఏకార్థజనకములు కావడం చమత్కారం వరూధిని దృష్టిలో ప్రవరుడు 'యక్ష తనయేందు జయంత వసంత కంతులం గెలువ జాలెడు వాడు' అంతే కాదు 'ఏలని బంటుగా మరున్ డక్కఁగొనంగరాదె అకటా! నను వీడు పరిగ్రహించినన్' అని తలచిన వరూధిని తలంపు ననుసరించి ప్రవరుని పరిగ్రహించిన తరళేక్షణకు మదనుడు జీతములేని బంటుగ సేవ చేయునటకూడ! కనుక వైసమాసం ఉపమాన పూర్వపద బహువ్రీహి అనుట కంటె పంచమీగర్భ సమాసం అని చెప్పి భావిలో వరూధినీ కథనాన్ని ఇక్కడే సూచించడం కవి హృదయమని నా అభిప్రాయం జ్ఞాపకసిద్ధమైన వ్యధికరణ బహువ్రీహిని ఆశ్రయించడం ఉభయత్ర సమానమే ఫలితమేమంటే మకరాంక శశాంకులకంటె మనోజ్ఞమైన ఆకారంగలవాడు అనే అర్థం సమంజసము అని!

౨

ఆ ప్రవరుని సంచరణాన్ని వర్ణిస్తూ –

'ప్రత్యూషపవనాంకురములు పైకొను వేళ
వామనస్తుతి పరత్వమున లేచి
సచ్ఛాత్రుఁడగుచు నిచ్చలు నేగియయ్యేట
నఘమర్షణ స్నాన మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి సావిత్రిజపియించి
సైకతస్థలిఁ గర్మసాక్షి కెఱఁగి
బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు
వచ్చె నింటికిఁ బ్రజ తన్ను మెచ్చి చూడ'

అని వ్రాసినాడు కవి ఇందులో నదీస్నానము ధార్మికత్వమునకు నిదర్శనము కాని ఇంతకుముందే ప్రవరుని యౌవనమందలి యజ్వగా వర్ణించి యుండడం ప్రకృత వర్ణనంలో లోపాన్ని కనబరుస్తోంది అదేమంటే పైవానిలో సాంధ్యకృత్యము, సావిత్రీజపము, సైకతస్థలి కర్మసాక్షి కెఱగుట అన్నపుడు మీమాంసా శాస్త్రానుసారం నిత్యకర్మలకు ప్రత్యవాయ పరిహారమమాత్రమే ఫలం గనుక సంధ్యావందనానంతరం పునః గాయత్రీ జపం చేయాలి గనుక సాంధ్యకృత్యము అన్న పదానికి సంధ్యావందన మంతయూ అర్థము చెప్పి నిత్య గాయత్రీ జపవిధానము ననుసరించి సంధ్యాంగముగ కాకుండ వేరే గాయత్రీజపము చేసి, మహాసౌరాది మంత్రములచే సూర్యుని ఉపాసించెను, అని అర్థము చెప్పుట ఒక పద్ధతి ఇప్పటికిని కొంతమంది శిష్టులు ఇట్లుగ ఆచరించుట లోకవ్యవహారంలోఉన్నది ఉత్తర మీమాంసామతము ననుసరించి సంధ్యాగత గాయత్రిచేతనే గాయత్రీ జపవిధానము సిద్ధించును. గావున 'సాంధ్యకృత్యము' అనే పదానికి అర్ఘ్యము అర్ఘ్యానంతర ఆదిత్య పరబ్రహ్మైక్య ధ్యానము అర్థం చెప్పి, సావిత్రి జపియించి అనే పదానికి సంధ్యాంగ గాయత్రి అర్థం చెప్పి 'సైకతస్థలి కర్మసాక్షి కెఱగి' అను దానికి కూడ సంధ్యాంగ సూర్యోపస్థానమే అర్థం చెప్పి సాంగసంధ్యానుష్ఠానం వెలిబుచ్చినట్లుగ చెప్పడం ఒక పద్ధతి ప్రస్తుతంలో ఏపక్షాన్ని ఆశ్రయించి అర్థం చెప్పినా సంధ్య మొత్తము నదీతీరమున చేసినట్లుగ తెలియుచున్నది ఇది మాధ్యాహ్నిక సంధ్యగాదు ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ వామనస్తుతి పరత్వమున లేచిన వెంటనే వర్ణింపబడిన సంధ్య మాధ్యాహ్నికి అనుట విరుద్ధము.

ఇట్టిరీతిగ ప్రాతస్సంధ్యను నదీతీరము నందు పూర్తిచేయుట ఆహితాగ్నికి అసంగతమని నేటి ఇచ్చటి ఆహితాగ్నుల పద్ధతి ననుసరించి తెలుస్తున్నది. అనుదిత హోమపక్షము ననుసరించి సూర్యోదయం కావడానికి ముందుగనే హోమం జరుగవలసి ఉంటుంది ఉదిత హోమపక్షాన్ని ఆశ్రయించినా సంధ్య అర్ఘ్యప్రదానము వరకు చేసి, నిత్యగార్హపత్యమునుండి దక్షిణాగ్న్యాహవనీయములను ప్రణయించి పిదప ఉదయమగువరకు గాయత్రి జపించి ఉదయమైనతరువాత సూర్యోపస్థానము చేసి, ఆతరువాత అగ్నిహోత్రము నారంభించి హోమం చేయడం నేటి ఆహితాగ్నులలో కనబడుచున్నది

అంతేకాక ఉదయము కాకపూర్వమే అగ్నిప్రణయనము చేయకున్నట్లయితే ప్రాయశ్చిత్తముగ రెండు హోమములు గూడ నేటి ఆహితాగ్నులు చేయుచున్నారు ఆపస్తంబశ్రౌత సూత్రంలో అగ్నిప్రణయనాన్ని గూర్చి 'అధివృక్షసూర్య ఆవిస్సూర్యే వా' అని చెప్పబడినది ధూర్తస్వామి ఇట్లు వ్యాఖ్యానించారు 'వృక్షాణా ముపర్యేవ సూర్యాంశవః న పృథివ్యాం సోఽధివృక్షసూర్యః (కాలః) ఆవిశ్శబ్దం ప్రకాశవాచీ ప్రకాశో యత్ర సౌరో దృశ్యతే సకాలః ఆవిస్సూర్యః' రుద్రదత్తుడుగూడ దీనిని ఇలా వ్యాఖ్యానించాడు సూర్యశబ్దేన రశ్మిలక్షణాభూమేః స్థితితారశ్మయః అధివృక్షమేవ విశంతే అస్మిన్కాలే అత్ర వా శబ్దః సముచ్చయే' అని మరియు ఉదయాస్తమయములకు పూర్వమే అగ్నిప్రణయనము చేయని పక్షంలో ('యస్యాగ్నిమనుద్ధృతగ్ం సూర్యోఽభ్యుదియాత్ చతుర్గృహీత మాజ్యపురస్తాద రేత్' అని ప్రారంభించి ఈ పక్షమునకు వికల్పముగ 'అథైకేషాం యస్యాగ్నిమనుద్ధృతగ్ం సూర్యో ప్రమోభినిచే దభ్యుదియా ద్వా మనోజ్యోతిర్జుషతాం త్రయస్త్రిగ్ంశత్తన్తవ యితి ద్వే చతుర్గృహీతే జుహుయాత్' అని ప్రాయశ్చిత్తము విధింపబడినది. 'అధివృక్షసూర్యే సాయ మగ్నిహోత్ర మోషసి ప్రాతరగ్ని హోత్రాయ' అని సత్యాషాఢ శ్రౌత సూత్రంలో చెప్పబడినది

ఇచ్చట ఆహితాగ్నులు పైని పేర్కొన్న 'అథైకేషాం' అను పక్షమునే ఆచరించుచున్నారు. శాశ్వతముగ గుర్తింపబడెడి ఈ శ్రౌతధర్మము పెద్దనగారి నాటికి మరోరీతిలో ఉండేదేమో, అనే అనుమానానికి ఇందు స్థానంలేదు. కారణమేమంటే అంతకు పూర్వులైన ప్రాచీన కవులుగూడ ఇట్టి ప్రణయనమును వర్ణించియున్నారు అంతేకాక ఆనాటికీ ఈనాటికీ ప్రమాణములైన కల్పసూత్రములొక్కటిగనే ఉన్నాయికాని, కల్పసూత్రములు పెద్దనగారి తరువాత పుట్టినవి గావు కనుక నేటి ఆహితాగ్నుల అనుష్ఠానానికి విరుద్ధముగ కన్పించే ఈ ప్రవరుని దినచర్యా వర్ణనం అతని యజ్వత్వమునకు విరుద్ధంగా కన్పడుతోందని కొందరు వేలెత్తి దోషంచూపిస్తే కొందరు విమర్శకాగ్రేసరులు పై విమర్శకులకు కావ్య మర్థంచేసుకోవడమే చేతకాదన్నారు అదేమండీ! అంటే అతని ధార్మికత్వమునే గ్రహించవలెను గాని ప్రత్యక్షరశః దానిని గ్రహించకూడదని వారి అభిప్రాయం వ్యక్తం చేశారు స్థూలదృష్టులకు ఈవాదం బాగానే ఉన్నది గాని, పరమాన్నం వండారని వర్ణిస్తూ వంటకము లన్నిటిలోనూ వేసే ఉప్పు అందులోనూ వేశారని వర్ణిస్తే పాకవిధానం తెలిసినవారికి అది ఎంత అనుచిత మనిపిస్తుందో అలాగే ఆహితాగ్నుల అగ్న్యుపాసనాక్రమము ఏ కొంచెమైనా తెలిసినవారికి ఇది అంత అనుచిత మనిపించక తప్పదు అంత మాత్రంచేత కవియొక్క అజ్ఞానాన్ని అంచనావేయడంకంటే వీలున్నంతలో దానిని పరిశీలించడం విజ్ఞలలక్షణము మనం ఏంచెప్పితే చెల్లదు? అని భావించే విమర్శకులకు ముందుగ నమస్కరించి ప్రకృత విషయంలో ఆపస్తంబ, బోధాయన, ఆశ్వలాయన ప్రముఖులైన కొందరు ఋషుల కల్పసూత్రములను తిరుగవేయగా దీనికి ధార్మికమైన సమాధానం దొరకింది ఈ విషయ విమర్శలో సాంగవేదార్థసమ్రాట్ బ్ర॥ శ్రీ లంక వెంకట రామశాస్త్రిగారికి అధమర్ణుల మని సవినయంగా విన్నవించుకుంటున్నాను ఆసమాధానరీతి ఇది ప్రస్తుతం గోదావరీ, కృష్ణాప్రాంతములలో కన్నదే ఆహితాగ్ను లందరు ఆపస్తంబమతానుయాయులు వీరికి ఆపస్తంబ కల్పసూత్రంలో ఉదయాత్పూర్వమే అగ్నిప్రణయనం విధింపబడింది అలా కాకపోతే ప్రాయశ్చిత్తము విధింపబడింది బోధాయన కల్పసూత్రప్రకారం ఉదయానంతరమే అనగ సంధ్యమొత్తము పూర్తియైన తరువాత ఉదయమునుండి 6 ఘడియల లోపులో ప్రణయన ప్రభృతి పూర్తివరకు సకాలమే కనుక అపుడు అగ్నిహోత్రము చేయుటమాత్రమే విధింపబడి యున్నది అంతేకాక నేటికి ప్రకృత గ్రంథ జన్మస్థలమగు హంపీవిజయనగర నికట గోకర్ణవాసులగు ఆహితాగ్నులలో కొందరు బోధాయన కల్పసూత్రానుయాయులుగనే కన్పట్టుచున్నారు కావున బోధాయనపక్షము ననుసరించి ప్రకృత ప్రవర దినచర్యావర్ణనము సుసంగతమే అయి ఉన్నది

3

ఇట్లే ద్వితీయాశ్వాస ఆరంభమున యోగసిద్ధ ప్రసాదిత పాదలేపుడైన ప్రవరుడు 'కటక చరత్కరేణుకర కంపిత సాలము శీతశైలము చూచినాడు. ఇక్కడ కరేణు శబ్దమున కర్థము వివాదాస్పదమై యున్నది కరేణు శబ్దమునకు ఆడుఏనుగ అని ప్రాచీన వ్యాఖ్యాతలు అర్థము చెప్పిరి ఆడుఏనుగ గనుకనే సాలములు కంపితములైన వని యులేవంటే ఖాదితములే వర్ణింపబడి యుండెడి వనియు చమత్కారమును చూపిరి.

కొందరు గజముల విషయంలో స్త్రీత్వమును దుర్బలత్వద్యోతక మనడం చమత్కార జనకం కాదన్నారు. అంతేకాక కేవల స్త్రీగజములు గాని, పుంగజములు గాని సాలములను కదిలించాయనడంలో వినిగమకం లేదన్నారు స్త్రీ పుంగజ సాధారణ్యాన్ని సాధించడానికై పుం స్త్రీలింగములందున్న కరేణు శబ్దములను ఏకశేషవృత్తి చేసి కరేణుః (స్త్రీ) చ కరేణుః (పుం) చ కరేణూ అనే ఏకశేషవృత్తి సాధిత అర్థద్వయ ప్రతిపాదిక కరేణు ప్రాతిపదిక సమాసంలో ప్రయోగింపబడిన దన్నారు అందుచే స్త్రీ పుం గజములచే కదల్చబడిన సాలములు గలది శీతశైల మన్నారు అయితే ఈ వ్యాఖ్యానము వ్యాఖ్యాతల వ్యాకరణ జ్ఞానపాటవాన్ని ప్రదర్శిస్తోం దనటం అతిశయోక్తి కాదు కాని మనుష్యులందువలె స్త్రీపుం భిన్నప్రకృతికములు గజజాతిలో ఉండవో లేక అట్టివి శీతశైలమందు లేవో ఉన్నప్పటికి వీరి దృష్టికి గోచరించలేదో గోచరించినా అవి సాలకంపన కర్తృత్వము నందలేదో మరి పొందకపోవడానికి కారణం ఏమిటో గోచరించడంలేదు అదియునుగాక కరేణు శబ్దమును జాతి పరముగ ప్రయోగించినట్లు భావించినట్లయితే స్త్రీ పుంభేదము వివక్షింపబడక గజసామాన్యము చెప్పబడి వీటిచే వివక్షితమైన అర్థము లభించడంలో విప్రతిపత్తి ఏమియు కన్పడదు. అట్టి శబ్దము ఏలింగములోనిదైనను సర్వలింగ విశిష్టార్థమును నిర్వచిస్తుంది దానికి అవి ఈ ఏకశేష బకబంధప్రయాస మేలకో గోచరింపదు. అట్టి పద్ధతిలో స్త్రీ పుం భిన్న తృతీయ ప్రకృతిగూడ గ్రహింపబడవచ్చును కావున ఆదోషముగూడ పరిహృత మగును. సరే ఇలా విచారణ చేస్తే ఇంకను భేదములు గోచరించవచ్చు. కాని కవిహృదయ మేమిటి? అనే ప్రశ్నకు నాకు తోచిన అభిప్రాయం మాత్రం ప్రాచీన వ్యాఖ్యాతృమార్గమున నున్న ఆడుఏనుగు అనే అర్థమే సమంజసమని అందుకు పైవాదములలో నున్న ఏ ఒక్కటియు హేతువుగాదు మరేమంటే ప్రవరుని దృష్టిలోబడిన శీతశైలముపై జరుగబోయే చరిత్రసంతను ఈ విశేషణంతో సూచించడం కరేణు శబ్దం స్త్రీలింగం అంటేనే స్ఫురిస్తుంది అట్టి భావ్యర్థసూచన వ్యంగ్యంగా చేస్తూ ఉండడం పెద్దనామాత్యుని కవిత్వంలో గలదంటూ మొదటివిషయంలో వివరించియున్నాను దీని స్వరూపం ఇది

'కటక = కొండ చరియలయందు, చరత్ = సంచరించే, కరేణు = ఆడ ఏనుగుయొక్క, కర = హస్తముచే, కంపిత = కదల్చబడిన, సాలము = వృక్షములు గలది' అనే అర్థంలో ఆలంకారిక మతానుసారం లింగముగూడ వ్యంజకమే కనుక కరేణు శబ్దార్థమైన స్త్రీలింగము వరూథినిని, సాలశబ్దనిష్ఠ పుంలింగము ప్రవరుని ప్రతీతం చేస్తాయి కాగా కొండ చరియలయందు నివసించే మదమత్తేభయాన యగు వరూథిని హస్తములచే కదల్చబడిన సాలప్రాంశువగు ప్రవరుడు గలది శీతశైలము కాబోవు చున్నది అనే అర్థం సూచితంకావడం ఇందులోప్రధాన విశేషం వెనుకనున్న విశేషణములలో ధర్మవిషయంలో అంబర చుంబి శిరస్కరైన ప్రవరునినుండి ఝరీపటలములవలె నిస్సృతములైన మృదంగ ధ్వనులను బోలిన వాక్కులచే పరిపుల్ల కలాపములు గలిగిన కలాపివంటి మనస్సు గలదైనది వరూథిని అనే భావం ప్రతీతంకావడం ఆలంకారిక సమయవిరుద్ధం కాదనే నా భావన శబ్దైక దేశములనుగూడ వ్యంజకములుగ అంగీకరించిన ఆలంకారికులు ఈ అర్థమును గ్రహించే సహృదయులే యని నా విశ్వాసం. కాగా ఇట్టి సూచ్యార్థ సూచనమును గ్రహించడానికి కరేణుశబ్దనిష్ఠ స్త్రీత్వం అవశ్యంభావి తన్మూలకమే ఈ వ్యంగ్యార్థ సిద్ధి ప్రాచీన వ్యాఖ్యాతలు ప్రాకారనే అభిమానం, విద్వేషం, రెంటిని ప్రక్కనుంచి ఈ ఆలంకారిక దృష్టితో చూచినవారికి ఇది రమణీయంగా గోచరిస్తుం దని నాభావన ఇందులో సహృదయ హృదయములే ప్రమాణము

౪

తృతీయాశ్వాసమున -

'వాలారుం గొనగోళ్ళ నీవలసతన్
వాయించుచో నాటప
స్మేళంబైన విపంచి నిన్న మొదలున్
నీవంటమిం జేసి యా
యాలాపంబె యవేళ( బల్కెడు ప్రభా
తా యాత వాతాహతా
లోలత్తంత్రుల మేళవింపగదవే
లోలాక్షి ! దేశాక్షికిన్'

అనే పద్యంలో ప్రభాతా యాత వాతాహతాలోలత్తంత్రులనుండి నాటరాగ ముదయించిన దని దేశాక్షిరాగమునకు మేళవింపవలసిన దని చెలులు వరూథినికి ఉద్బోధించా రని వ్యాఖ్యాతలు దీనిని స్వభావోక్తి అలంకార మన్నారు. వాయువు తాకిడికి మేళవించిన వీణనుండి ధ్వనులు ఉదయించడమే సరసంగాని రాగ ముద్భవించడం విడ్డూరంగా వుందే! అన్నారు వైణికులైనవారు వీరనేది ఏమిటంటే ఇప్పుడు కన్పడుతున్న వీణియ స్వరూపం ఆధునికం. దీనికి ప్రధానంగా నాల్గు తీగలు తాళమును సూచించేవి మూడు మొత్తం సప్తతంత్రిగ గోచరిస్తోంది దీనిప్రకారం రాగంకోసం మేళం మార్చే ప్రసక్తి అసలు ఉండదు. 28 సోపానములతో ఉన్న కారణంగా మేళం చేసి దానిపై అన్ని రాగాలు పలికించవచ్చు ఇక దీనికిపూర్వం ఉండే వీణకు చాలాతీగలు ఉండేవట వీటి నన్నిటిని రాగానుగుణ స్థానములను పలికేటట్లు

చూడడం మేళవించుట అంటారు ఆ తంత్రులను గోటమీటితే ధ్వని వస్తుంది ి ధ్వనుల సముదాయమే రాగ మని ిలువబడుతుంది అంతేగాని ప్రభాతా ఘాత వాతాహతము లైనంతమాత్రంలో ్వని రాదు వచ్చినా అది రాగంగా విన ిడదు ఇలా అనుచితంగా వ్రాశా డేమి ిని ప్రశ్నిస్తే వీణల చరిత్ర ప్రకారం గారు చెప్పేది నిజ మనిపిస్తోంది అయితే వితా పితామహు నంతటివాడు పొర గాటు చెప్పే డనడం మహాసాహస మని ిందరూ అంగీకరించిన విషయం పరిశీ స్తే కొ ె కొన్ని విషయాల్లో కవిత్వా ికి వాస్తవానికి వైరుధ్యం కన్పడుతుంది ోదావరిలో ః మలాలు కవిత్వంలో కన ిడుతుంటాయి వాస్తవంలో ప్రవా ాంలో కన్పడవు కనుక నే దీనిని కవి ిమయం అన్నారు అలాగే మాఘకవి ాడ ప్రథమసర్గలో నారదమహర్షిని ర్ణించే సప్తశ్లోకిలో –

రణాభిరాఘట్టనయా నభస్వతః
  పృథగ్విభిన్న శ్రుతిమండలై స్స్వరైః
స్ఫుటీభవద్గ్రామ విశేషమూర్ఛనా
  మవేక్షమాణం మహతీం
                    ముహుర్ముహుః'

ిని వాయ్వాఘాతముచే గ్రామవిశేషము ల మూర్ఛన స్ఫుటముగ కలిగియున్న ిణను నారదుడు చూచినట్లుగ వర్ణించి యున్నాడు. వ్యాఖ్యాత మల్లినాథసూరి అత్ర పుంవ్యాపార మంతరేణ స్వరా ిర్భావోక్త్యా కోపిలోకాతిక్రాంతోయం ల్ప సౌష్ఠవాతిశయో వీణాయాః ప్రతీ యతే తేన సహ స్వతః ప్రసిద్ధాతిశయస్య ిభేదేవ అధ్యవసితత్వాత్ తన్మూలాతి యో క్త్యలంకారః సా చ మహత్యాః ిపుంవ్యాపారం వినా మూర్ఛాద్యసంబంధే ి సంబంధాభిధానాత్ అసంబంధే సం ింధ రూపతయా పుం వ్యాపారాఖ్య ిపకారణం వినాపి మూర్ఛనాది కార్యోత్పత్తి ద్యోతనా ద్విభావనా వ్యజ్యతే ఇతి అలంకారిక ధ్వని రితి సంక్షేపః' అని చెప్పి అతిశయోక్త్యలంకారాన్ని నిర్ణయించారు విభావన వ్యంగ్య మన్నారు అయితే ప్రకృతంలో వరూథిని వీణెనుగూడ ఇట్టి అలౌకికత్వమును అంగీకరించడంలో దోష మేమియు కన్పట్టదు కారణం ఈమె సురకాంత. నారదుడు దేవర్షి వారికి సంబంధించిన వీణలుగూడ అతి మానుషములు కావడంలో అనౌచిత్యం ఏమియూ లేదు అయితే వచ్చిన చిక్కల్లా వ్యాఖ్యాతలు ఈపద్యంలో స్వభావోక్తి ఉం దనడమే కనుక ఇందులో అసంబంధే సంబంధ కల్పన రూపమైన అతిశయోక్తి అంటే వైణికులు కలహించవలసిన అవసరం ఉండదు అంతేగాక అధ్యాహారపద్ధతి తెలుగులో ఉచితం కా దని అథర్వణుడు చెప్పినా ప్రకరణాదులు ఆ అర్థాన్ని బోధిస్తూ ఉండడం అనుచితం కాదు గావున ఈపద్యాన్ని అన్వయించడంలో –

'వాలారుం గొనగోళ్ళ నీ వలసతన్
  వాయించుచో నాటకన్
మేళంబైన విపంచి నిన్న మొదలున్
  నీ వంటమిం జేసి, యా
యాలాపంబె అవేళ బల్కెడు
                    (కావున) ప్రభా
  తా యాత వాతాహతా
లోల త్తంత్రుల మేళవింపగదవే !
  లోలాక్షి దేశాక్షికిన్'

వాలారుం గొనగోళ్ళ నీవలసతన్ వాయించుచోన్=వాయించేయెడల నాటరాగానికి మేళవించియున్న ఈవిపంచి నిన్నటి నుండి నీవు ముట్టనికారణంగా ఇపుడు నీవు వాయించేయెడల ఆరాగాన్నే ఈ అకాలంలోగూడ వినిపిస్తుంది గనుక తం(త్రు)లను దేశాక్షి రాగానికి మేళవింప

---

# ధర్మమార్గము

– శ్రీ అక్కల బాలకృష్ణయ్యగారు



కరములు మోడ్చి సృష్టి లయ
  కారుల వేడివరాలు పొంది, శ్రీ
కరమగు ధర్మమార్గమున
  కాలిడ బూనక, రావణాది ము
ష్కరు లవివేకులై చెడిన
  గాథలు కొల్లలు గానవచ్చెడిన్,
వరములు కావనేరవు, ప్ర
  వర్తిలు ముత్తమ ధర్మబుద్ధివై



---

మోలోలాక్షీ! యని చెలికత్తెలు చెప్పేరంటే ప్రాచీన విపంచికా రూపమునకు విరోధము రాదు వాయ్వాఘాతము రాగ జనకము కానక్కరలేదు ప్రభాత వాయ్వాఘాతము రాగజనక మంటే వాదం లేస్తుంది కాని తంత్రీలోలతకు హేతు వంటే విరోధం ఉండదు. అది స్వభావోక్తి అలంకారమే అవుతుంది. కాని ప్రాచీన వ్యాఖ్యాతల వ్యాఖ్యానము పూర్వపక్షము కావలసి వస్తుంది 'పురాణమిత్యేవ న సాధు సర్వం' అని కాళిదాసే చెప్పేడు ఈ అన్వయం స్వభావోక్తిని స్థిరపరుస్తుంది వివాదాన్ని పరిహరిస్తుంది ఇందు సహృదయుల మనస్సు ఎటు మొగ్గుతుందోమరి!

'జయంతి తే సుకృతినో రససిద్ధాః
                    కవీశ్వరాః!'

# రాధ — మధుర గాధ

— డా॥ పూసపాటి భాగ్యలక్ష్మి, ఎం ఏ, పిహెచ్ డి

ఆంధ్రసారస్వత బృందావనమును వికసింపచేయు ప్రసరించిన మధురగాథా మరుత్ వీచిక రాధిక జన్మముచే పల్లకీ విలోలేక్షణ యైనను, మాననీయ మునీశ్వర మానస వైకుంఠ కేళీమందిరుని తన హృదయమందిరమున బంధింపజాలిన సాంద్రానురాగ హృదయ శ్రీకృష్ణుని పట్టమహిషిగ అగ్రతాంబూలము నందిన అతివ రుక్మిణియే యైనను, పదునారు వేల గోపికలకంటె, అష్టమహిషులకంటె మిన్నయై, అతనిని వలచి వలపించుకొనిన శృంగార రసాధిదేవత రాధికయే పూర్వజన్మ ప్రారబ్ధముచే యమునాతీర వంశనాళముల మధురమైన రాగ మాలపించు వేణువుగా మారి, ఆ పురుషోత్తముని అధరమణి సమీపన్యాస ధన్యావస్థను పొందినరీతి, జన్మముచే మానవియైనను, భక్తిరక్తులచే మాననీయయై గతజన్మ విశేషముచే ముక్తి నందిన ప్రణయ తపస్విని. భగవానుడగు శ్రీకృష్ణుడు ఈమె పేరు మీదనే ప్రసిద్ధుడగుట, ఆ నామమునే బ్రహ్మాది దేవతాబృందము నిత్యము స్తుతించి తరించుట ఆమె ప్రాభవమునకు నిదర్శనము ఇన్ని కమనీయ గుణములకు కాణాచియగు కమలాకరము కనుకనే ఈమె చరితము ఎందరో కవిభృంగముల నాకర్షించి, వారు పులకించి, మైమరచి వర్ణించుకొను మధురగాథగ మారినది

రాధ మధురగాథను వర్ణించు వాఙ్మయ వాహిని స్థూలముగ రెండు వేణికలుగ ప్రవహించినది - ప్రాచీన పురాణ వాఙ్మయము, లౌకిక వాఙ్మయము గోలోక వాసినియై, సర్వసృష్టికిని కేంద్రభూతయై రాసమండలేశ్వరిగ, సర్వజగత్ప్రస్వరూపముగ శ్రీకృష్ణుని హ్లాదినీశక్తిగ మూలప్రకృతి స్వరూపముగ చిత్రింపబడిన విధము పురాణ వాఙ్మయప్రోక్తము ఇది పరమతాత్త్వికము, దార్శనికము రెండవది అర్వాచీన వాఙ్మయమునందు ప్రచలితమైన మార్గము ఈ మార్గమునకు సంబంధించిన రాధ ప్రణయ పరిణపరిఫుల్ల శృంగారమూర్తి విరహవిధుర, స్వైర విహారశీల కొన్నిట వివాహిత భగవానునితో వివిధ బాంధవ్యములు కలిగినట్టిది కొన్నిట శ్రీకృష్ణుని ప్రేమచంద్రికా చకోరియై అతనిని వివాహమాడినట్టిది ఆధునిక వాఙ్మయమున ఆమె నిత్యము స్మరించుకొను ప్రణయదేవతగ చిత్రింపబడినది

పురాణ వాఙ్మయమునందు విష్ణుకథా సంకలితములైనవి రాధను పేర్కొనకుండుట అతివిచిత్ర మనిపించును. రాధా చరితము నుట్టంకించిన పురాణములందు ప్రసిద్ధములైనవి - బ్రహ్మవైవర్త పురాణము పద్మపురాణము, దేవీభాగవతము, గర్గసంహిత కావ్యములందు గీతగోవిందము ప్రసిద్ధము బ్రహ్మవైవర్తపురాణమునందు రాధాకృష్ణుల తత్త్వములు అభిన్నము లని, పరస్పర అవిభాజ్యములనియు నిరూపింపబడినది సనాతన స్వరూపోదయ భాగ్యయుక్తిచే కృష్ణుని వక్షఃస్థలమున సంతత మోదము నందు భాగ్యశాలినిగ మునీశ్వర సురేశ్వర గోచరమగు మాననీయ మహిమశాలినిగ, రాసమండలేశ్వరిగ, సకల ప్రపంచమున కేలికయగు శ్రీకృష్ణుని తన శాసనమును ధిక్కరింప సమర్థత లేని కీలుబొమ్మగ చేసికొనిన శక్తిరూపిణిగ ఈమె వ్యక్తిత్వమును దేవీభాగవతము తీర్చిదిద్దినది. వృషభానుని పుత్రికగ గతజన్మమున కృష్ణుని గోలోక పరమేశ్వరిగ, శ్రీకృష్ణుని తేజము నాలుగుమార్గములై లక్ష్మి - భూమి - నీల - విరజ - అను రూపములతో రాధయందు లయించునట్లుగ గర్గభాగవతము నిరూపించినది

రాధ యను నామముకూడ సార్థకమనునట్లుగ, దాని అర్థము పురాణములందు వివరింపబడినది

రేఫోహి కోటి జన్మాఘం
కర్మభోగం శుభాశుభమ్
ఆకారో గర్భవాసం చ
మృత్యుంచారోగ ముత్సృజేత్
ధకార ఆయుషోహాని
మాకారో భవబన్ధనమ్ ॥

రేఫోహి నిశ్చలాం భక్తిం
దాస్యం కృష్ణపదామ్బుజే ॥
సర్వేప్సితం సదానన్దం
సర్వ సిద్ధౌఘ మీశ్వరమ్
ధకారః సహవాసం చ
తత్తుల్యం కాలమేవ చ ॥
దదాతి సాసార్ష్టి సారూప్యం
తత్త్వజ్ఞానం హరేః సమమ్
అకార స్తేజసాం రాశిం
దానశక్తిం హరౌ యథా

బ్రహ్మ వై పు శ్రీకృష్ణ. జ ఖం
అధ్యా 13. శ్లో 104,105,107,109

రాధ = ర్ + అ + ధ్ + అ ఇందలి రేఫము కోటిజన్మార్జితమైన శుభాశుభ కర్మఫలమును హరించి కృష్ణపదాంభోజ భక్తియును దాస్యమును వాంఛితార్థమును నొసంగును. శ్రీకారము జన్మ మృత్యు రోగములను నశింప చేయును ధకారము భవబంధముల నడంచి, దీర్ఘాయువొసంగి, కృష్ణుడెంత కాలముండునో అంత కాలము తత్ సాహచర్యమును, వాని సారూప్యమును తత్త్వజ్ఞానము నొసంగును రెండవ అకారము బ్రహ్మతేజమును, దానశక్తిని, యోగశక్తిని, సర్వకాల హరిస్మరణమును నొసంగును మరియొక సమన్వయముకూడ

* తెలుగుదనం *

* ఇటీవల రాజమండ్రి పేరు రాజమహేంద్రిగా మార్చాలిఅంటూ బయలుదేరిన ఉద్యమంలో ఒక విద్యార్థినాయకుడు, ఒక ఆఫీసరు, రాజమండ్రి పదంలో తెలుగుదనం లేదని కనుక రాజమహేంద్రిగా మార్చాలని తెలిపియున్నారు

* రాజమండ్రిలో లేని తెలుగుదనం రాజమహేంద్రిలో ఏమి ఉన్నదో కొంచెమైనా వారు వివరిస్తే బాగుండేది. ప్రస్తుత ప్రజాస్వామ్య యుగంలో శాబ్దిక విచారం చేసేహక్కు ఎవరికీ లేదనడం సాధ్యం కాదుకదా!

---

కలదు రకారము - రమను, ఆకారము - గోపికను, ధకారము - ధరిత్రిని, అకారము_విరజను సూచించును ఈ సమన్వయము సామమార్గమున శ్రీకృష్ణ భగవానుని నోటినుండియే వెలువడినది ఈ సమన్వయము నే మిగిలిన గ్రంథము లన్నియు వేరువేరు విధముల సాధించినవి

ఆంధ్ర వాఙ్మయమున అద్భుతముగ శ్రీకృష్ణతత్త్వమును తీర్చిదిద్దిన భారత భాగవతాదులు ఇంతటి మహనీయమూర్తియగు రాధ గాథను స్మరింపకుండుట ఆశ్చర్యము గొల్పును తెలుగు సారస్వతమున రాధాప్రశస్తికి శ్రీకారము చుట్టిన మహనీయుడు శ్రీనాథుడు

వాలిక మోము మత్తవన
  వర్హి కిశోరకలాస్యలీలఁ బై
వాలిచు పచ్చకప్పురపు
  వాసనతోడి ముఖారవిందతాం
బూలపు మోవి మోవిపయి
  మోపుచు రాధను నిచ్చు ధూర్తగో
పాలుడు ప్రోచు గావుత మ
  పార కృపామతి మంత్రి యన్ననిన్

భీమే పు ఆ 1, ప 3

ఇది భీమేశ్వరపురాణమున ఇష్టదేవతా ప్రార్థన సందర్భములోనిది ఇందు రాధామాధవుల శృంగారము వర్ణింపబడినది ఇది తెలుగు వాఙ్మయమున రాధాకృష్ణ తత్త్వప్రతిపాదనకు బీజావాపనము. పూర్వ పురాణప్రోక్తమగు తాత్త్విక, దార్శనిక తత్త్వములకు, అర్వాచీన కాలమున వివరింపబడిన లౌకిక శృంగార తత్త్వమునకు వారధియై ఈ పద్యము రాధాకృష్ణులను దేవతామూర్తులుగ, శృంగారమూర్తులుగ వివరించుట గమనార్హము

మొట్టమొదటగా ఈ వాఙ్మయ నందన వనమున పరిమళించిన కావ్యప్రసూనము 'రాధామాధవము' బ్రహ్మవైవర్త పురాణమునందలి రాధాతత్త్వమును సంపూర్ణముగ గ్రహించి, ఆ దివ్యప్రకృతినే లక్ష్మీదేవిగ భావించి ఈ రాధమాధవ కావ్యమునందు రాధాదేవిని శ్రీమహాలక్ష్మి అవతారముగ కల్పించి ప్రశంసించినాడు చింతలపూడి యెల్లనార్యుడు. పురాణ ప్రోక్తమైన తత్త్వమును పోతనామాత్యుని రుక్మిణీకల్యాణ కథమూసలో పోసి కరగించి అందమైన ఆభరణమువలె ఈ కావ్యమును తీర్చిదిద్దినాడు

'రాధామాధవ' కావ్యము నందలి ప్రత్యేకవిషయము 'రాధ'ను స్వకీయగ తీర్చిదిద్దుట అనునది కావ్యమునందు శతగోపుని కుమార్తెయై జన్మించిన రాధ బాల్యమునండియు శౌరి గుణగణవర్ణనముల నాకర్ణించి అతనిని వివాహమాడిన విధానము వర్ణింపబడినది సామాన్యముగ లోకమున రాధామాధవుల ప్రేమలాసములను చిత్రించిన కవులు ఆమెను పరకీయగ చిత్రించినారు ఇట్లు చిత్రించుటకు గల ఆధారము బ్రహ్మవైవర్తము నందు గలదు బ్రహ్మవైవర్తము నందలి విషయమును గూర్చి నడకుదుటి వీరరాజు పంతులుగారు ఈవిధముగ పేర్కొనినారు 'భగవంతునియెడ భక్తునికి గల యెడతెగని ప్రేమము, స్వైరిణికి ఉపపతియందు కలుగు నిరంతర దృఢానురాగము వంటి దను అనుభవసాధ్యదృష్టాంతమును రూపకముగా ప్రదర్శించుటకుగాను బ్రహ్మవైవర్తపురాణకారుడు కాపమున మూలప్రకృతి స్వరూపిణియైన రాధాదేవిని భూలోకమునకు తెచ్చి పరకీయ భూమికను కల్పించి ఆత్మభర్తయైన శ్రీకృష్ణునే ఉపభర్తగా చేసి ఆమెకు అతనియెడ గల నిరతిశయానురాగవ్యాజమున పరమభక్తిని ప్రదర్శించినాడు' ఇట్లు బ్రహ్మవైవర్తపురాణమునందు రాధ నామమాత్రముగ రాయణ పత్నియైనట్లుగ కలదు కాని వారిరువురి బాంధవ్య ప్రస్తావన మెచటను చేయబడలేదు అంతేకాదు బ్రహ్మాది దేవతాగణ సమక్షమున శ్రీకృష్ణుని వివాహమాడినట్లు కలదు ఇట్టి దృష్టితో పరికించిన రాధ స్వకీయయే అగును

ప్రాచీన భారతవర్షమున స్త్రీలకు జ్ఞానమార్గము నిషిద్ధము చేయబడినది. వేదాధ్యయనముల కధికారము లేకుండుటచే కర్మమార్గము కష్టసాధ్యమైనది. అందుచే భక్తిమార్గమున వారల కధికారమేర్పడినది సౌందర్యమందలి మోహముచే ఘటిల్లిన అనురాగము మనుష్య సంబంధములగు అనురాగము లన్నిటికంటెను బలవత్తరమైనది కనుక అనంత సౌందర్య వికసము నారాధించు యోగులకు, జ్ఞానులకు, ఉద్దిష్టమై జీవాత్మ పరమాత్మల భేదమును తెలిసికొని ఈశ్వర మగ్నయై అనగా మూలప్రకృతిస్వరూపుడైన శ్రీకృష్ణునియందు లగ్నమనస్కయై అతనిని భర్తృభావముతో ఆరాధించినది రాధ వివాహమాడిన వ్యక్తి, బాల్యమునందు తలిదండ్రులు నిశ్చయించిన వ్యక్తి, భర్తకాడనియు, మనసా వాచా కర్మణా ఎవరిని ఆరాధింతురో అట్టి వ్యక్తియే భర్తయనియు ఒక సిద్ధాంతము కలదు ఈ దృష్టితో పరికించిన వాఙ్మయమునందంతటను రాధ స్వకీయయే అగును. బ్రహ్మ

## రాజమండ్రి నగర సౌందర్యం

ఇటీవల రాజమండ్రిని సౌందర్యవంత ముగా తీర్చిదిద్దేందుకు ఒక సభా, ఆ సభలో వివిధ ప్రముఖులు అనేక సూచనలు చేయడమూ, జరిగినవి. ఏపనులు చేయాలో, ఏవి మానాలో కూడ, తెలుపబడింది.

ముఖ్యమైన నగరవీధులు పెక్కింటిలో నిత్యమూ నిలిచిఉంటూ, అనేక విధాల రోదచేస్తూ, మనుష్యుల రాకపోకలకు కూడా ఇబ్బంది కలిగిస్తూ రాత్రి ఇండ్లలోని జనానికి నిద్రాభంగం కలిగిస్తూ, ఉన్న లెక్కలేని లారీల విషయం ఎవ్వరిదృష్టికీ వచ్చినట్లు లేదు అవి నగరానికి సౌందర్యావహములే అని భావింపబడలేదు కదా!

---

వైవర్తపురాణమునందు గల అంతరవిషయములను పరిశీలింపక కేవలము బహిర్భావమును మాత్రమే గ్రహించి పలువురు కవులు ఆమెను జారిణిగా చిత్రించినారు కాని రాధామాధవకవి అట్టి అయథార్థ కల్పనకు తనకావ్యమున స్థానమీయలేదు మీదుమిక్కిలి జన్మజన్మల అనుబంధ మనునట్లుగ ఆదినారాయణుని పత్నియైన లక్ష్మియే, అతడు కృష్ణావతారమునందగా తాను రాధయై అతనిని వివాహమాడినట్లు ఆమె స్వకీయత్వమును వర్ణించినాడు

బ్రహ్మవైవర్తపురాణము, గర్గసంహితలు గోలోకవాసినియైన రాధ శ్రీరాముని శాపముచే మానవిగా జన్మించినట్లు వర్ణించినవి. ఇది శ్రీకృష్ణుడు సపత్నియైన విరజతో క్రీడించుటవల రాధ పొందిన ఈర్ష్యాసూయలకు ఫలితము చింతలపూడి ఎల్లనార్యుడు ఆమె భూలోకాగమనమున నొక ప్రత్యేకకథ కల్పించినాడు లక్ష్మీదేవి పూర్వము శ్రీరామచంద్రుడు మనోహరాంగుడగుట విని శంకరునిచే అతనిని రప్పించి, మోహించుటయు, కాని ఆ అవతారము ఏకపత్నీ ప్రధానమగుటచే ఆమె కోరిక విఫలమగుటయు జరిగినది. కృష్ణావతార సమయమున తాను అతని లీలలయందు పాత్రధారిణి కావలయునని తలచి తన మనోగతవాంఛను భర్తకగుక పరచిరది శ్రీవిష్ణుకును ఆమె మనోవాంఛన, ఈశ్వరేచ్ఛను నెరిగి ఆమెను శత గోపు నింట 'వల్లవీ విలోలేక్షణయై' జన్మింప అనుమతి యిచ్చినాడు ఇట్టి ప్రత్యేక కథాకల్పనముచే రాధయంగు లక్ష్మీదేవి అంశమాత్రమేకాక, ఆమె కేవలము లక్ష్మియే అను విషయమును నిరూపించినాడు మూలమునందలి సపత్నీ మాత్సర్యమూ, వల్లభుని నిందించు వాక్ప్రాగల్భ్యములు ఈ కల్పనముచే తొలగింపబడినవి మీదుమిక్కిలి ఈలోకమున కూడ అతనిని అనుసరించి ఉండవలెనను ఆమె కోరికతో వారి పరస్పరానురాగము వ్యక్తపఱుపబడినది. ఇట్లు కావ్య ప్రారంభమునందే రాధాదేవి యందలి దైవతాంశను నిరూపించి కవి ఆమె దివ్య చరిత్రకు కట్టుదిట్టమగు పునాదిని నిర్మించినాడు కావ్యమునందక్కడక్కడ ఈ విషయమును నిరూపించుచునే ఉన్నాడు

రాధామాధవ కావ్యకథ రుక్మిణీ కల్యాణపు తీరుతెన్నులలో నడచినది అతిముగ్ధయగు రాధ బాల్యమునుండియు శౌరి గుణగణవర్ణనములను ఆకర్ణించి, అతనిని వలచి, తన వలపును చెలికత్తె ద్వారా అతనికి తెలియజేసి, స్వయంవర సభామంటపమున అతనిని వివాహమాడినది ఈ కావ్యమునందంతటను ఆమె ప్రేమాతిశయము, ఆత్మనిగ్రహము, వివేకము వాక్ప్రాగల్భ్యము ప్రస్ఫుటిత మగుచున్నవి

(సశేషం)

# ఈ పక్షంలో

### సమాలోచన
### చతుర్థ వార్షికోత్సవము

1-11-80 తేదీ శనివారం సాయంకాలం హుసాకుల్లబ్బువారి యాజమాన్యమున రాజమండ్రి బాబాయమ్మ మెమోరియల్ హాలులో సమాలోచన పత్రపత్రిక నాలుగవ వార్షికోత్సవసభ జరిగినది. రాజమండ్రి ట్రయినింగు కాలేజీ ప్రొఫెసరు శ్రీ బి యస్ ఆర్ ఆంజనేయులు గారు సమావేశానికి అధ్యక్షత వహించిరి 'సాహిత్యానికి సమాజ శ్రేయస్సు ప్రధానం కావాలి సమాలోచన ఆ విధముగా పురోగమించాలి. కాలేజీ అధ్యాపక వృత్తినుండి పదవీవిరమణము చేసిన శ్రీ సీతారామశాస్త్రిగారు వయోధికులైనా సమాలోచన ద్వారా చేయుచున్న సాహితీసేవ నిరుపమానం' అని వక్కాణించారు

సుప్రసిద్ధ జాతీయనాయకులు శ్రీ శ్రీవ్విడి లింగరాజుగారు సమావేశమును ప్రారంభించిరి 'పత్రికారంగంలో అనేక దశాభేదములలో నాకు అనుభవం వుంది. అధిగమింపరాని అనేక సమస్యలెదురౌతూఉంటాయి వాటిని తప్పించుకొని సమాలోచన జయప్రదంగా నడచుచుండడము హర్షదాయకం ఆర్థికంగానూ తదితరవిధాలుగాను శాస్త్రిగారికి చేయూత ఇయ్యడం సహృదయుల కర్తవ్యం' అని చెప్పిరి

ప్రముఖసాహితీవేత్త శ్రీ ఎస్ రామాచారి (సి టి ఓ) గారు సమాలోచన వార్షిక సంచికను ఆవిష్కరించిరి సమాలోచనకు రు 100 లు విరాళ మొసంగిరి 'సమాలోచన అని పేరు పెట్టడంలో విమర్శాపద్ధతితో నడపడం ఉద్దేశం అ.

భావిస్తున్నాను ఏవిధమైన ప్రకటనలూ లేకుండా భ్రాంతిసదృశంగా కేవల సాహిత్యపత్రిక నడపడం చాల శ్రమతో కూడిన పని అన్నిరకాల సమాలోచనకి సహాకారం అందియ్యగలను' అని ఉద్ఘాటించిరి

సమాలోచనసంపాదకులు శ్రీ బులుసు సీతారామశాస్త్రి హుషారు క్లబ్బువారి తమకుగల సంబంధమును, హుషారుక్లబ్బు కార్యక్రమములను వివరించిరి అన్నిరంగాలలోను అతిచోరబు చేసికొన్నదనీ ఏవిధమైన రాగద్వేషములూ లేకుండా సాహిత్యాది విషయాల్లో గుణదోష విమర్శని పెంపొందించడం సమాలోచన ముఖ్యాశయమనీ, ఆర్థికాది సమస్యలు ఎట్టివి ఎదురైనా వాటిని అధిగమించి ముందుకుపోవడమే సమాలోచన ధ్యేయమనీ వక్కాణించిరి

వి. టి కాలేజీ ఆంధ్రోపన్యాసకులు శ్రీ కాశీభట్ట శేషయ్యశాస్త్రిగారుపన్యసించుచు కాలేజీ అధ్యాపక పదవినుండి విరమించిన తర్వాత సంపాదకులు శ్రీబులుసు సీతారామశాస్త్రిగారు సమాలోచనద్వారా చేయుచున్న సాహిత్య సేవ ప్రశంసనీయమనిరి వీరి వ్యాఖ్యలు విమర్శలు సునిశితమనోజ్ఞములనిరి అందుకు సమాలోచన సంచికలనుండి ఉద్ధరించి అనేక ఉదాహరణములొసగిరి

ప్రముఖ లాయరు, జర్నలిస్టు శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తిగారు ఉపన్యసించుచు ఆముక్తమాల్యద మొదలు అమృతంకురిసినరాత్రి వరకు ప్రాచీనాధునాతన గ్రంథములపై విమర్శలు సమాలోచనలో ప్రచురించుట సంపాదకుల విశాలదృక్పథానికి నిదర్శన మన్నారు భారతి తెయవాతి ప్రతిభ, జయంతి మున్నగు ననేక సాహిత్యపత్రికలు వెలువడినవనీ, అవేవి చిరకాలం నిలువలేదనీ, సమాలోచన అవిచ్ఛిన్నముగా భారతి స్టాండర్డులో మూడేండ్లనుండి కొనసాగుచుండుట విశేషమనీ చిరకాలం కొనసాగించే అన్నివిధముల స్తోమతూ శ్రీ సీతారామశాస్త్రిగారికి కలదనీ వక్కాణించిరి

శ్రీ వి. తమ్మిరాజు (రిటైర్డు హెడ్మాష్టరు) గారు మాట్లాడుచు సమాలోచన ఉత్తమస్థాయిలో ఉన్నదని, విద్యార్థులు కొందరు తమతో ప్రసంగించిన విషయములను వివరించిరి

శ్రీమల్లంపల్లి దుర్గాప్రసాద్ (సంస్కృతోపన్యాసకులు) మాట్లాడుచు సమాలోచన నామకరణౌచిత్యాన్ని తననుగుణంగా సమాలోచన నడచుచున్న తీరును ప్రశంసించిరి

శ్రీ సి నరసింహాచారి (విజ్ఞాన ట్యుటోరియల్ కాలేజీ, శ్రీమతి లక్ష్మీనరసమ్మ కాన్వెంటు వ్యవస్థాపకులు) మాట్లాడుచు సమాలోచన డిక్లరేషనూ, పోస్టల్ కన్సెషనూ శ్రీ శాస్త్రిగారికి సునాయాసంగా లభించినవి అనిరి శాస్త్రిగారు సంకల్పసిద్ధులనీ, పత్రిక అవిచ్ఛిన్నంగా కొనసాగింపగల రని, సంపాదకీయాలు సాంఘిక సాహిత్యాలపైనే కాకుండా రాజకీయాలపైనికూడా నిశితంగాను వ్యంగ్యవిలసితంగాను వీరు వ్రాసేతీరు మనోజ్ఞమనీ తెల్పిరి

ఆంధ్రభూమి, దక్కన్ క్రానికలు కరస్పాండెంటు శ్రీ కంచుమర్తి శ్రీరాములుగారు 'గౌతమీ గ్రంథాలయం కార్యనిర్వాహకవర్గ సభ్యత్వంతో శాస్త్రిగారు నాకు బాగా పరిచితులు వారి నిష్పక్షపాత దృష్టీ, ఆలోచనా సరళీ శ్లాఘ్యములు నేను ఈపత్రికల కరెస్పాండెంటుగా స్థిరపడడానికి సమాలోచన పత్రికపై నేను వ్రాసిన రెవ్యూలము పత్రికల సహాకారం సమాలోచనకి అందించడం పత్రికల ధర్మం' అని ప్రసంగించిరి

సుప్రసిద్ధ సంస్కృతాంధ్రాంగ్ల విద్వాంసులూ, మహోపన్యాసకులూ అయిన శ్రీ వాజపేయాజుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఎన్నిగ్రంథములో పరిశీలన చేసినవారు, విజ్ఞానులూ అయితేతప్ప వ్రాయలేని విషయాలు సమాలోచనలో కనపడుట విశేషమనిరి సంస్కృతికిగల విశేషార్థము వివరించిరి సమాలోచన అవిచ్ఛిన్నంగా సాగుటకు సహకరింపగల మనిరి,

ఆరంభంలో అధ్యక్షులకూ, సభాప్రారంభకులకూ, ఆవిష్కర్తకూ, వక్తలకూ, స్వాగతం పలికిన శ్రీ సి నరసింహాచారి వందనసమర్పణములతో సభ ముగిసినది.

— —

## కవిసార్వభౌముని జయంతి

ఇటీవల కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి 115వ జయంత్యుత్సవ సభ రాజమండ్రి, శ్రీమతి లక్ష్మీనరసమ్మ కాన్వెంటులో జరగినది. ప్రముఖ న్యాయవాది శ్రీ మద్దూరి శివరామకృష్ణయ్యగారు సభకి అధ్యక్షతవహించిరి సార్వభౌముని భారత భాగవత గ్రంథాలకు విస్తృత ప్రచారం జరగాలని వక్కాణించిరి

రాజమండ్రి ట్రయినింగు కాలేజి ప్రొఫెసరు శ్రీ బి ఎస్ ఆర్ ఆంజనేయులు గారు సభాప్రారంభం చేసిరి కవిసార్వభౌముని సర్వతోముఖప్రజ్ఞను కొనియాడిరి

శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తి, శ్రీ చిలుకూరి రామభద్రశాస్త్రి, శ్రీ సి నరసింహాచారి, టెక్కెరు కృష్ణమాచారి, శ్రీ రామేవ బ్రహ్మం, శ్రీమతి కసీతామహాలక్ష్మి కవిసార్వభౌముని వైశిష్ట్యాన్ని ప్రస్తుతించిరి

శ్రీ బుగ్గా పాపయ్యశాస్త్రిగారు కవిసార్వభౌముని గ్రంథములపై పరిశోధనలు జరగడంపట్ల హర్షం వెలిపుచ్చిరి శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారి దౌహిత్రుడు శ్రీ కె ఎస్ సత్యనారాయణమూర్తిగారు అష్టావధాని చిలుకూరి రామభద్రశాస్త్రిగారిని సందర్భమున సన్మానించిరి.

# సమాలోచన సం టములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన [illegible] సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు ముగా నున్నది. వెల రు. 20 లు ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రి పోష్టులో పంపగలము.

రెండవ సంపుటము వాల్యూములును కొలదిగా ఉన్నవి. వెల రు. 20 లు ఎం. ఒ. వారికి పై విధముగనే పంపబడును. వి. పి. పద్ధతి లేదు.

మొదటి సంపుటము ప్రతులు పూర్తిగా అయిపోయినవి.

— సంపాద

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. కె. కాలేజి,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B V. & Co. Press, Innispet (Tyagaraja Nagar) Rajahmundry-1.